Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide. Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.



శ్రీ [illegible] వెంకట సుబ్రహ్మణ్యం

## హిందీ ప్రచార సమ్మేళనం

మహబూబునగరం జిల్లా ద్వితీయ హిందీ ప్రచార సమ్మేళనం రాబోవు నవంబరు నెలలో రఘుపతి పేటలో జరుగనున్నది. ఆహ్వాన సంఘం ఏర్పడినది. ప్రముఖ పండితులు, కవులు, కళాకారులు, హిందీ ప్రచారకులు, నాయకులు సమ్మేళనంలో పాల్గొనగలరు.

## ఈ సంచికలో

# స్రవంతి - సూచనలు

1. స్రవంతి ప్రతినెల 10 వ తేదీన చందాదార్లకు పంపబడును.
2. ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడు ప్రతి చందాదారూ తనకు నిర్ణయింపబడిన సంఖ్యనుగూడా తెలియ జేయవలెను.
3. కనీసం మూడునెలలైనా వరుసగాలేనిది చిరునామా మార్పు అంగీకరించబడదు. చిరునామా మార్పును కోరువారు తగినంత ముందుగా కార్యాలయమునకు తెలియజేయవలెను.
4. సమీక్షకు పుస్తకములను పంపువారు రెండు ప్రతులను తప్పక పంపవలెను. పుస్తకములను పంపినవారు వెంటనే సమీక్షను ప్రచురించమని ఉత్తరములు వ్రాసి ప్రయోజనం లేదు. వీలువెంబడి అన్ని పుస్తకములూ సమీక్షించబడగలవు.
5. రచయితలు తమ రచనలను కాగితమునకు ఒకవైపుననే వ్రాసి పంపవలెను. అక్షరములు సాధ్యమైనంత స్పష్టంగా ఉండడం గూడా అవసరము.
6. తమ రచనలను తిరిగి పంపమని కోరువారు 0—2—0 తపాలా బిళ్ళలు పంపవలెను.

---

టెలిగ్రామ్: హిందీసంఘ | ఫోన్ : 4406
సంవత్సర చందా | విడిప్రతి
రు. 2-0-0 | రు. 0-4-0

# ప్రవంతి

సంపుటి ౨ | అక్టోబరు, 1955 | సంచిక ౭

*సంపాదకీయం :*

## సంస్కృతభాష - హైస్కూళ్లు

ఆంధ్ర ముఖ్యమంత్రి గా. శ్రీ గోపాలరెడ్డిగారు ఆంధ్ర రాష్ట్రంలోని ఉన్నత పాఠశాలలన్నింటిలో సంస్కృత భాషను నిర్బంధ పఠనీయ విషయకంగా ప్రవేశపెట్టగలనని అన్ననాటినుండి దేశంలో ఈ విషయమై తీవ్రమైన వాదోపవాదాలు బయలుదేరినవి. పలువురు విద్యావేత్తలు ఈ వాదోపవాదాలలో పాల్గొని తమతమ అభిప్రాయాలను వివరించి ఉన్నారు.

సంస్కృతం దేవభాష అని ఎంతో గౌరవంగా పిలవబడుతూ ఉన్నది. ఆభాష భారతీయ సంస్కృతికి ప్రతిబింబప్రాయంగా రూపొంది ఉన్నది. భారతీయ విజ్ఞాన భాండారమంతా సంస్కృతభాషలో నిహితమై ఉన్నది. అంతేగాక ఈనాడు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రచలితములైన ప్రాంతీయ భాషలు సంస్కృత భాషాజన్యాలే. ప్రాంతీయ భాషలన్నింటిలోనూ నూటికి అరవైవంతులు సంస్కృత శబ్దాలే వాడుకలో ఉన్నవి. కనుక మన జీవితంతో పెనవేసుకొనిపోయిన సంస్కృత భాషను ఉపేక్షించడానికి వీలులేని పరిస్థితిని మనం గమనిస్తూనే ఉన్నాము.

ఇక హైస్కూళ్ళలోని పాఠ్యక్రమాలను చూస్తే అవి విద్యార్థి మనోవికాసానికి ఎంతవరకు ఉపయోగ పడుతున్నవో సందేహించవలసిన స్థితిలోనే ఉన్నవి. ప్రస్తుత మున్న విధానాన్నిబట్టి మాతృభాష, రాజభాష, ఇంగ్లీషు మూడు భాషలను ప్రతి విద్యార్థీ నిర్బంధంగా చదవవలసి వస్తున్నది. ఇక నాలుగోభాష సంస్కృతాన్నిగూడా [illegible]స్తే విద్యార్థి నేర్చుకొన గలడా అనేది ఒక సమస్య. వాస్తవానికి ఈ

విధంగా నాలుగేసి భాషలు నిర్బంధం చేయడం సమర్థనీయం కాదు. చిన్న వయస్సులోని పిల్లలపై ఇన్ని భాషలను నేర్చుకొనే భారాన్ని వేయడం ఉచితం కాదు. ఇంగ్లీషును తొలగించి ఆ స్థానంలో సంస్కృతాన్ని ప్రవేశపెట్టవచ్చును. విశ్వవిద్యాలయాలలో ఐచ్ఛికంగానో నిర్బంధంగానో ఇంగ్లీషును నేర్పించే ప్రయత్నం చేయవచ్చును. కాని, ఇంగ్లీషును తీసివేయడానికి విద్యావేత్తలు కొంతమంది వ్యతిరేకంగా ఉన్నారు. కనుక ఈ భాషాసమస్యను పరిష్కారం చేసే విధానమే కనపడడం లేదు. ప్రాంతీయ భాషలలో నూటికి అరవైవంతులు సంస్కృత శబ్దాలున్నవని పైన చెప్పియే ఉన్నాము. ఆ శబ్దాల సుస్వరూపాన్ని తెలుసుకొనడానికీ, ప్రాంతీయ భాషలను సక్రమంగా అభ్యసించడానికీ సంస్కృత భాషాపరిచయం అవసరం గనుక ప్రాంతీయభాషా పాఠ్యక్రమంలోనే సంస్కృతాన్నిగూడా ఒక భాగంగా చేసి వారానికి రెండుగంటలు నేర్పిస్తే కొంత సంస్కృతంతో పరిచయం కలగడానికీ తద్వారా ప్రాంతీయ భాషాజ్ఞానాన్ని అభివృద్ధి పరచుకొనడానికీ ఉపయోగకరంగా ఉంటుంది. అంతమాత్రం సంస్కృత పరిజ్ఞానం ఉంటే విద్యార్థికి సరిపోతుంది. అట్లుగాక సంస్కృతాన్ని ప్రత్యేక భాషగా ప్రవేశపెట్టడం విద్యార్థులను బాధపెట్టడమే అవుతుంది.



కవిత:

# గీతాత్రయి

శ్రీ బి. వి. సింగరాచార్య

౧

అలంకార భారములను
త్యజియించెను నా గీతము
మరియ దామె జరీపట్టు
పుట్టమ్ముల గుపవమ్మున.

నా నీ మైక్యమునకు ఈ
నగ లాటంకములు స్వామి!
నీ నా గుసగుసలను విన
నీవు నగల ఘలంఘలలు.

కవినను నాగర్వము ని
గ్గనిన లజ్జ కరగి పోవు;
కవివి నీవె నీ పదముల
కడనె స్వామి! నా స్థానము.

బ్రతుకు వెదురు గ్రోవిగా, ని
రాడంబరముగ తీరుగ
పొందవికొందు స్వామి! దాన
పూరింపుము నీ గానము.

౨

ఒక త్రుటి నను నీ సరసను
ఉపవిష్టుని సేయుము నా
కర్తవ్యము లెల్లను ని
[illegible] స్వామి!

నీ ముఖ మండలము గనక
నా మదికి ప్రశాంతి లేదు
అవధిలేని కృషిసాగర
మం దపార మీ నా కృషి.

వేడి వేడి శ్వాసలతో
వాడుటాకు గలగలతో
నేడు నా గవాక్షము దరి
నాడ వచ్చినది వేసవి.

మొక్కలెల్ల మొగ్గ తొడుగు
పూల చమను కొలువులోన
వైతాళిక గీతావళి
పాడు మధుపపాళి.

నీ మ్రోలను మౌనముద్ర
నిలచి, పొంగు నా నీరవ
సువిశ్రాంత జీవితమున
కంకిత గీతమ్ము పాడ-

నిదియే తగు సమయము మ
న్నింపుము నా వేడ్క స్వామి!

ఒక త్రుటి నను నీ సరసను
ఉపవిష్టుని సేయుము నా
కర్తవ్యము లెల్లను ని
ర్వర్తించెద పిదప స్వామి!

ఏనెరుంగ స్వామి ! నీవు
గాన మెట్లు పచరించెదో !-
మౌన ముద్ర నేను సంభ్ర
మానందావశత వింటు.

నీ గాన ప్రభలొసంగు
నీ గోళమునకు వెలుంగు
నీ గానోచ్ఛ్వాసములే
సాగు గగన గగనాంతము....ఏనె.

నీ పవిత్ర మధురగాన
నిర్ఝరరాశి ప్రవహిల్లును
కొండరాల దాటి, దూసి,
కోసి చీల్చుకొని దుముకుచు....ఏనె.

నా యెడంద దందడించు
నీతో శ్రుతి గలిపి పాడ
గాని, యేమిలాభము స్వా
మీ ! నీ శ్రుతి నా కందదు....ఏనె.

ప్రలాపింతు నే నేదో
పాటలగును ప్రలాపములు ?-
అంచు నేను వంటిగుమిలి
"హా స్వామి!" యంచార్చెద...ఏనె.

నిత్యమోహనము, మధురము
నీదుగాన మను వలలో
బందీగా గైకొంటివి
స్వామీ! నా బతుకు నెడద !... ఏనె.

— *రవీంద్రుని గీతాంజలినుండి.*



వ్యాసము :

# విశిష్ట వ్యక్తిత్వంగల కథకుడు పద్మరాజు

— *శ్రీ డి. రామలింగం*

నేటి తెలుగు కథానిక చరిత్ర చాలా చిన్నదైనా అతి త్వరగా దీనికొక స్వరూపం ఏర్పడడం, మరి యే ఇతర ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యాలతో పోల్చి చూచినా సరితూగగల బలాన్ని మన కథానిక సంపాదించడము జరిగింది. ఈ విషయం ప్రపంచ కథానికల పోటీలోనే విదితమయింది. చెప్పుకోదగ్గ కథలను వ్రాసిన వారిని ఆంధ్రదేశంలో ఒక ఇరవై మందినైనా పేర్కొనవచ్చు. మళ్ళీ ఈ ఇరవైమందిలోనూ ఐదువ్రేళ్ళవరకే లెక్కకువచ్చే ప్రథమశ్రేణి కథకులున్నారు. ఆ ఐదుగురిలోనూ పాలగుమ్మి పద్మరాజుగారు ప్రముఖంగా చెప్పుకో దగినవారు.

ఆధునికులైన తెలుగు కథకులలో పద్మరాజుగారు విలక్షణులైన కథకుడు ...
మార్గం, భాష, భావం, కథావస్తువు, శిల్పం అన్నీ వేరుగా ఉంటాయి

త్వాన్నీ, అతిలోకమైన భావాన్నీ, తాత్విక సూత్రాన్నీ, మనశ్శాస్త్ర మర్మాన్నీ ఈయన చిన్న కథలో నేర్పుగా చెప్పగలడు. కథావస్తువు ఏదయినా తాను ప్రత్యేకంగా కృషిచేసి, వడుపుతో సాధించిన శిల్పంతో దాన్ని చక్కని కథగా మలచగలడు. సాధారణులనూ మేధావులనూ రంజింపజేయగలడు; కదిలించగలడు; ఆలోచింపజేయ గలడు.

కథానిక ద్వారా, వేరే సాహిత్యం ద్వారా తెలుగుదేశంలో ఈయన ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం పొందగలిగాడు. ఎలా పొందగలిగాడని ఆలోచిస్తే ఈయనలోని సంస్కారం మేధాగత ప్రతిభ మానవత్వాన్ని అర్థంచేసుకునే హృదయం, వీటన్నిటి మూలంగా ఈయనలో వచ్చిన పరిణామం కారణమనిపిస్తాయి. భారతీయమైన తత్వం, దానికితోడు పాశ్చాత్య విధానపు విద్య, విజ్ఞానశాస్త్రంతో పరిచయం, ప్రపంచంలో రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా నానావిషయకంగా బయలుదేరిన సిద్ధాంతాలను, ఉద్యమాలను, ఆయానాగరికతలను తెలుసుకోవడం, సమాజపరిణామాన్ని తర్కబుద్ధితో గమనించడం, అన్నిటికంటె ప్రాథమికమైన వ్యక్తినీ, మానవత్వాన్నీ ప్రాతిపదికంగా పరిశీలించి హేతువాదంతో ఆకళింపు చేసుకోవడం— వీటన్నిటి మూలంగా పద్మరాజు సాహితీవ్యక్తిత్వం రూపొందింది. అందుచేతనే ఈయన కథలూ, తదితర రచనలూ మేధావులలోను, సామాన్య పాఠకులలోను సమంగా ఆదరణ పొందాయి. ముఖ్యంగా విద్యావంతులకు, అందులోను పల్లీయమైన జీవితంలోనుంచి పాశ్చాత్య సంపర్కం ఫలితంగా నాగరికమైన ఆధునికమైన జీవితంలోనికి ప్రవేశించిన యువజనానికీయన మిక్కిలి అభిమాన పాత్రుడైన సాహిత్యకుడయ్యాడు. లాక్షణికులు సైతం ఈయన కథాకథన విధానాన్నీ, చెప్పే విషయాన్నీ మెచ్చుకున్నారు.

అసలు సాహిత్య ప్రయోజనం గురించి పద్మరాజుగారికి కొన్ని అభిప్రాయాలున్నవి. కళ కళకోసమే అన్న వాదాన్ని వారు అంగీకరించరు. మొత్తం మీద సాహిత్యానికి ఒక ప్రయోజనముండాలి. అయితే ఆ ప్రయోజనాన్ని గురించి మాత్రమే అనేక భేదాభిప్రాయాలున్నాయి. సాహిత్యం 'మంచి'ని చేకూర్చాలంటారు అంతా. అయితే ఆ మంచి అనేది ఏమిటి అని పద్మరాజుగారు ప్రశ్నిస్తూ అంటారు; "కొందరికి ప్రాచీన సంస్థలు, ఆ నమ్మకాలు మంచివి. కొందరికి దైవభక్తి మంచిది. కొందరికి ఆధ్యాత్మిక దృష్టి మంచిది. ఎవరెవరు ఏది మంచిదిగా అనుకొంటారో ఆ 'మంచి'ని సాహిత్య ప్రయోజనంగా నిరూపిస్తూ వచ్చారు. మనిషికి ఏది మంచిది అనేది మానసికమైన విషయం. సుఖభోగాలు తుచ్ఛమైనవనీ, వాటిమీద మోజుచంపుకుంటేనేగాని మనిషికి ముక్తి లేదనీ చాలా మందికి నమ్మకముంది. కాని వారు వాటికోసమే నిత్యమూ పాకులాడుతూ ఉండడం మనం చూస్తున్నాము. వారి మనస్సులో ఎక్కడో ఈ సుఖభోగాలు లేకపోతే బ్రతకలేమనేటంత గాఢమైన వాంఛ ఉండితీరాలి. ఎనక తేలిన విషయమేమిటంటే మనిషి వ్యక్తంగా ఏది మంచిదనుకుంటున్నాడో అది నిజంగా అతనికి మంచిది అనే నియమం ఏమీ లేదు. సామాన్యమానవుడికి ఏదిమంచిదో నిజంగా అతనికి తెలియదు. అందుచేత తాత్వికంగా ఏది మనిషికి కావాలో అతని మనస్సుకి ఏది అత్యావసరమో, ఏది లేకపోతే అతడు సంఘ జీవిగా జీవించలేడో అదే అతనికి మంచి

ఈ దృష్టితో చూచినప్పుడు మనస్సుయొక్క ఆరోగ్యాన్ని కాపాడడం కంటె ఉదాత్తమైన ప్రయోజనం ఇంకొకటి లేదు. ఆ పరమ ప్రయోజనాన్ని సాహిత్యం నెరవేరుస్తుంది అంచేత సాహిత్యం ఉత్తమమైన మానవకృషులలో ఒకటి అనడానికి ఏమీ సందేహం లేదు. పద్మరాజుగారి దృష్టిలో - పద్మరాజుగారి కంటె భిన్నమైన అభిప్రాయాలుగల కథకు లున్నారు. వారూ సాహిత్య ప్రయోజనం గురించి కొన్ని నిర్వచనాలు చెప్పారు. అయితే పద్మరాజుగారు చెప్పినది హేతుపూర్వకమైనదిగా కన్పిస్తుంది. పైగా ఈ దృక్పథంలో కొంత మనోవైశాల్యంకూడా వున్నది. మనకి మోజు ఉన్నంత మాత్రాన్ని ఒక విషయం పరమ సత్యం అవాలని లేదని వారంటారు. ఇది ప్రాథమికమైన సత్యం. కథకుడికీ, రచయితకు ఇటువంటి నిష్పాక్షికమైన శాస్త్రీయదృష్టి ఉండడం అవసరం. అప్పుడే అతడు చెప్పేదానికి ఒక విలువ ఉంటుంది. మరి ఒక రాజకీయ వేత్తకూ, సాహిత్యకునికీ వున్న భేదంకూడా ఇదే. రాజకీయాలకూ సాహిత్యానికీ గల అంతరాన్ని పద్మరాజుగారు ఇలా చెప్పారు: "రాజకీయాల్లో లాగ సాహిత్యం సమష్టిమీద నడువవలసిన ఉద్యమం కాదు. ఫలాని రకం కవిత్వం వ్రాయాలని పదిమంది కూర్చొని తీర్మానించిన కారణంచేత మంచి కవిత్వం రాదు. తక్కిన ఉద్యమాలకి గమ్యస్థానం ముందు నిర్ణయ మవుతుంది. కాని ఒక్కొక్క రచయిత ఒక్కొక్క పద్ధతిగా వ్రాసిపారేసిన రచనలుగాని సాహిత్యానికి రూపం ఏర్పడదు."

అంతేగాక ఏకాలపు సాహిత్యాన్ని ఆ కాలపు విశ్వాసాలనుండి విడదీసి చూడ్డం పొరపాటని పద్మరాజుగారి అభిప్రాయం. విశ్వాసాలకు విలువ మారుతుంది. కాని విలువ మారినంత మాత్రాన్ని ఆ విశ్వాసాలు మొదటినుండీ అస్థిరదాయకమైనవని అనడానికి వీలులేదు. పాత తత్వానికీ కొత్త తత్వానికీ గల సంబంధాన్ని, వాటి రెంటినీ పరిశీలించవలసిన విధానాన్నిగూర్చి పద్మరాజుగారిలా చెబుతారు:

"ఒక రాజు రాజ్యం చెయ్యడమనే రాజకీయపద్ధతి నవీన యుగంలో వింతగా కన్పిస్తుంది. అతనుకూడా రక్తమాంసాలతో ఉన్న మానవుడనీ, దేవుడి అంశమాత్రంకాడనీ మనకి పూర్తిగా తెలిసిపోయింది. కాని ఒకనాటి యుగంలో రాజు దేవుడనుకోవడం సహజమనీ, ఆనాటి నాగరికతకు అది అవసరమనీ దానివల్ల సంఘచరిత్రకు పునాది అంటూ ఏర్పడిందనీ మనం గుర్తించాలి."

ఈ విధంగా మొదటినుండీ వీరు హేతువాదంతో వ్యక్తినీ, సంఘాన్నీ, చరిత్రనూ మానవప్రకృతినీ పరిశీలిస్తూ వచ్చారు. కాబట్టే కళనుగూర్చి, సాహిత్యాన్నిగూర్చి, నాగరికతను గూర్చి ఎదుటి వాడికి స్పష్టంగా చెప్పగల నిశ్చితాభిప్రాయాలు కలిగివున్నారు.

పద్మరాజుగారిలో అనేక పరిణామాలు వచ్చాయి. చిన్న తనంలో సంస్కృతం చదువుకున్నారు. మొదట ఆశుకవిత్వం చెప్పారు. రాడికల్‌పార్టీ భావాలు వీరిని కొంత ఆకర్షించాయి. ఆధునికమైన గేయాలు వ్రాశారు. వీరి "పురిటిపాట" చక్కని గేయమని కొందరు విమర్శకు లన్నారు. ఆతరువాత ఎందుకోగాని కవిత్వం మానుకొని గద్యరచనకు పూనుకున్నారు. వీరు కవిత్వం ఎందుకు మానివేశారా అని ఆలోచిస్తే వారే వ్రాసిన ఒక వ్యాసంలో ఇలాఅన్నారు: "పద్య కవిత్వంలో వ్యక్తమయ్యే వాంఛలన్నీ సామాన్య జీవితంలో [illegible]

తోంది. కాపుమనలేక నోరార్చుకుని కాకులు ఒంటికన్ను చూపులు అటూ ఇటూ చూస్తు న్నాయి. కూలివాళ్లు బిండిలిని గిన్నెలు మెల్లగా కడుక్కున్నారు. గట్టుమీద ఉన్న చింతచెట్టు మొదట్లో చుట్టూ కూర్చున్నారు. తలగుడ్డలలోనించీ, రొంటినించీ పొగాకుతీసి కొంచెం నీళ్ళతో తడిపి చుట్టలు చుట్టుకున్నారు." ఆ దృశ్యం, వాతావరణం కళ్ళకు కట్టినట్లుగా లేదూ?

పల్లీయుల సహజమైన జీవితాన్ని గురించి వ్రాసిన రచయితలలో పద్మరాజుగారిదే అగ్రస్థానం. పల్లీయులను గూర్చి పద్మరాజుగారికి అవాస్తవికమైన అంచనాలు లేవు. పల్లెటూరి వాతావరణంలో మనుషులకుండే లక్షణాలు అన్నీ ఉన్నాయి. వారు చదువుకున్న వారినే తప్పటప్పు చేస్తారు కాని నష్టపోరు. ఇదే పద్మరాజుగారి భావం. వీరి "కూలీజనం" కథల సంపుటానికి బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు పరిచయ వాక్యాలు వ్రాస్తూ "నేను ఎరిగున్నంతలో వరకు పల్లెజీవితం గురించి సహజంగాను, అభిమానంగానూ తెలుగు భాషలో వ్రాసే శ్రేష్ఠ రచయితలలో పద్మరాజుగారే ముఖ్యులని నా ఉద్దేశం. ఆయన మన రచయితలలోకెల్లా చాలా శక్తిమంతుడని నేననుకుంటూ వుంటాను" అన్నారు. ఈ అభిప్రాయం వారు వెలువరచి దాదాపు ఒక దశాబ్దం కావస్తున్నది. అప్పటినుంచి రచయితగా పద్మరాజుగారు అందుకున్న శిఖరాలు వారి లోకం పెరిగినవే.

పద్మరాజుగారు రచయితగా ఒక విశిష్ట వ్యక్తిత్వంగలవారనడానికి వారి "ఎదురు చూస్తున్న ముహూర్తం" కథ తార్కాణం. ఈ కథను చదివిన తరువాత చాలాకాలం వరకు నా impression నా మీద అలాగే వుంది. నిజం చెప్పాలంటే ఆ కథలోని ముఖ్యపాత్ర శాంత లాంటి మనిషి ఎక్కడైనా కనిపిస్తుందా అని కథ చదివిన నాటినుంచి ఇంతవరకూ చూస్తూ వచ్చాను. ఆమెలోని కొన్ని లక్షణాలు గల మనుషులు నాకు కొందరు కనిపించారు. కాని దాదాపు పూర్తిగా అటువంటి మనిషే అని చెప్పగలిగినవారెవరూ నాకింతవరకు సందర్భ పడ లేదు. అందుచేతనే కాబోలు, ఆ పాత్ర నాలో ఒక typical స్త్రీలా నిల్చిపోయింది. ఆ పాత్ర జ్ఞాపకం వచ్చిందంటే అదొక మధుర స్వప్నంలా అనిపిస్తుంది. ఉత్తమ కథానికకుండవలసిన లక్షణాలనుగూర్చి పలువురు రచయితలు పలువిధాలుగా చెప్పారు. ఒక పర్యాయం కొడవటిగంటి కుటుంబరావుగారినడిగాను, ఏమన్నారంటే "ఉత్తమ కథానికకు ఉండవలసిన లక్షణాలు అనేకమున్నాయి. కథ చదివిన తరువాత అది ఒక కొత్త అనుభవంగా తోచితే దాన్ని మంచి కథగా ఎంచవచ్చును. కథ చదివాక రచయిత భావం అంతటితో ఆగిపోక మన ఆలోచన ఇంకా కొనసాగించగలిగితే దాన్ని మంచి కథగా ఎంచవచ్చును. అయితే ఒక పర్యాయం చదివిన కథను మరొక పర్యాయం చదవాలనే కాంక్ష పాఠకుడిలో కలిగించిందంటే దాన్ని ఉత్తమమయిన కథగా ఎంచవచ్చు." —ఈ ప్రమాణాన్ని బట్టి "ఎదురుచూస్తున్న ముహూర్తం" కథకు విలువ కట్టినట్లయితే తెలుగు కథానికా సాహిత్యంలో ఉత్తమమయిన చాలా కొద్ది కథలలో ఇది ఒకటనిపిస్తుంది. ఇందులో ప్రధానపాత్ర శాంత విచిత్రమైన ప్రవృత్తిగల యువతి. చక్కని జనాభాకంటె తానొక పై తరహాకి చెందిన వ్యక్తినని ఆమె గట్టి నమ్మకం. తను చాలా అందగత్తెనని ఆమె అభిప్రాయం. కాని ఆ విషయాన్ని నలుగురికీ తెలియజెప్పాలనే కుతూహలం లేకపోవడమే ఆమెలోని గొప్పతనం. ఆమె ఎప్పుడూ దేనికోసమో ఎదురుచూస్తు

తన జీవితాన్నంతనీ తారుమారు చేసే సంఘటన ఎప్పుడో ఎలాగో ఏదో వస్తుందనీ, అది అతి లోకమైన అనుభవం అవుతుందనీ ఆమె గట్టి నమ్మకం. ఆ సంఘటన ఎలాంటిదో ఆమెకు తెలీదు. కాని దానికోసం ఆమె నిత్యమూ నిరీక్షిస్తూ వుంటుంది. ఆమె కాలేజీలో ప్రవేశించిన తరువాత ప్రతివ్యక్తిలోను, ప్రతి సందర్భంలోను ఈ సంఘటనకోసం వెదికింది. కాని కాలేజీ వదలివేసేదాకా ఆ ముహూర్తం మాత్రం రాలేదు. తరువాత మామూలు పద్ధతిలో ఆమె పెళ్ళి జరిగిపోయింది. వరుడు వైద్య పరీక్షకు చదువుతున్నాడు. ఆమె కాపురానికి వెళ్ళింది. తన భర్త వట్టి మగవాడని ఆమె ముందే నిశ్చయించుకొంది. పెళ్ళిలోనే వరుని తమ్ముడు వెంకటం ఆమెను కొంత ఆకర్షించాడు. అతను చాలా సరదాగలమనిషి. ముఖ్యంగా ఆడ వాళ్ళతో అతను చాలా చనువుగా ప్రవర్తిస్తూ ఉంటాడు. పత్రికలకి కథలు రాస్తాడు. కాలేజీలో అతనికీ, ఓ కిరస్తానీ అమ్మాయికీ సంబంధంవుందని శాంత తన స్నేహితురాలిద్వారా వింటుంది. అప్పటినుంచే అతనంటే ఆమెలో ఒక విధమైన ఆకర్షణా, ఓ విధమైన అసహ్యమూ కలిగాయి. మద్రాసులో భర్తతో కాపురం సుఖంగానే గడచిపోతూవుంది. అయినా ఆమెలో ఏదో తీరని వ్యథ. ఈ జీవితం ఆమెకు సంతృప్తికరంగా లేదు. కాని ఎలా మారితే తనకు బాగావుంటుందో ఆమెకు స్పష్టంగా తెలీదు. అప్పుడే ఆమె వెంకటం వ్రాసిన కొన్ని కథల్ని చదువుతుంది. అన్నీ మగవాళ్ళూ, ఆడవాళ్లూ ప్రేమా - అవన్నీ వెంకటానికి అనుభవమైన విషయాలవునో కాదో తెలుసుకోవాలని ఆమెకు మనసులో కుతూహలం. ఒక్కొక్క కథే చదువుతూ వుంటే అతనికి అనేకమంది ఆడవాళ్ళతో పరిచయం ఉండి తీరాలని అనుకుంది. 'ఇటువంటి అవినీతి కథల్ని సంఘం ఎందుకు సహించాలి' అని ఆమె భర్తతో వాదిస్తుంది. చివరికొక రోజు వెంకటం వారింటికి వస్తాడు. శాంతభర్త హాస్పిటల్ డ్యూటీకి వెడతాడు. రాత్రి ఆమె గదిలోపల పడుకుంటుంది. అతను పక్క హాలులో. అతను కథవ్రాసుకోవడానికి లోపలికొచ్చి పెన్ను తీసుకుంటాడు. ఆ అలికిడికి ఆమె లేస్తుంది. అసలామె నిద్రపోలేదు. ఎన్నో విషయాలు - జరిగినవీ, జరగవలసినవీ ఆమె మనస్సులోకి వచ్చిపోతున్నాయి. కథలో ఈసన్నివేశంలోనే ఇద్దరికీ మొదటిసారిగా సంభాషణ జరుగుతుంది. అదికూడా సుదీర్ఘమైన సంభాషణ. కథ ఈ ఘట్టంలో ఎంతో ఉత్తమమైన climax కు చేరుకుంటుంది. శాంత లక్షణాలను వెంకటం ఇదివరకే బాగా గ్రహించి వున్నాడు. ఆమెకూడా వెంకటం చేష్టలను ఎరిగి అతనంటే సచ్ఛీలుడు కాడనే ఒక అభిప్రాయం కలిగివుంది. వెంకటం వ్రాసిన ఒకానొక కథనుగూర్చి వారిద్దరికీ వాగ్వివాదం జరుగుతుంది. ఆ కథలో ఒకామె వుంది. ఆమె ఉత్తమ ప్రేమను వాంఛిస్తుంది. ఆ ప్రేమ ఆమెకు కరగతమయ్యే పరిస్థితులలో దాన్ని అందుకోడానికి ఆమెకు సాహసం చాలదు. అనేకులు ఆమెకు చాలా ఆప్తులయ్యే పరిస్థితులు ఏర్పడతాయి. నిజమయిన అనురాగం ఎప్పుడుసఫలోన్ముఖంగా అవుతుందో ఆ క్షణంలో ఆమె దాన్నుంచి తొలగిపోతుంది. చివరికి ఆమె క్రీస్తుమతం స్వీకరించి బ్రహ్మచారిణి అయి వృద్ధాప్యం వరకూ ఒక బడిలో ఉపాధ్యాయినిగా పనిచేసి చివరికి చచ్చిపోతుంది. చివరిరోజుల్లో ఆమె అతి కఠినంగా మారిపోతుంది. దయా, దాక్షిణ్యమూ ఆమెలో [illegible] యౌవనాన్నీ ప్రేమనీ చూస్తే ఆమెకు ద్వేషం ఏర్పడుతుంది.

ఆమెనిషి లక్షణాలు తనలో వున్నాయేమోనని శాంత అనుమానం. పెళ్ళి చేసుకొని కాపురాలు చేస్తున్న స్త్రీలందరిలోనూ ఆ లక్షణాలున్నాయని వెంకటం వాదం. అతను తన విషయాన్ని గూర్చి కూడా బహిరంగంగా చెప్పుకుంటాడు. తన శరీరానికీ మనస్సుకీ పెళ్ళి సరిపడదు. కాని సంఘంలో పెళ్ళిచేసుకుంటేనే పురుషుడికి గౌరవస్థానం. అది లేకుండా వేరే విధంగా తిరుగుతూవుంటే సంఘం దృష్టిలో అతను చెడ్డవాడు. అయినా వెంకటంవాదం ఇది. మనస్సుని ఆపుకో గలిగితే పెళ్ళిమాత్రం ఎందుకు? మనస్సుని ఆపుకోగల మనుకున్న వాళ్ళు అలాలేని వాళ్ళని చూస్తే ఎందుకు అసూయ పడాలి? కథలో ఈ దృశ్యంలోనే చివరి కామె లక్షణాలన్నిటిని అతను చెప్పేస్తాడు. "హెచ్చుతగ్గులు చూస్తే ఒకమూల మీకు భయం, ఒకమూల సాహసం. అందుచేత మీరు సుఖంగా బతకలేరు: మీలాట్టి పిల్లల ఉన్న వాళ్ళని సుఖంగా బతకనివ్వరు. నేను వట్టి పుకార్లవాడిననీ విన్నావు. పచ్చిరావడంలోనే నీ అందానికి ముగ్ధుడనైపోరా ననుకున్నావు. నేనలా ప్రవర్తించలేను. పోయిరండు పిల్లా-" అంటూ ఇంకా అతను చెప్పబోతూవుంటే ఆమె దాన్ని అంగీకరిస్తూనే "అదేకాదు. నీ కథలో స్త్రీ లాగా అయిపోతానేమోననే భయం వేసింది. ఏదో ఒక కానిపని చేస్తే ఆదెబ్బతో మనస్సు చెదురుతుం దనిపించింది. కాని సాహసం లేకపోయింది" అంటుంది. ఆమెలో ఏదో ఆకర్షణ ఉన్నట్టు అతనూ ఒప్పుకుంటాడు. అందుచేతనే ఇక అక్కడ ఉండడం ఇద్దరికీ మంచిది కాదని వెంటనే నిష్క్రమిస్తాడు. అతనంటే ఆమె కిదివరకున్న అభిప్రాయాలు క్రమంగా మారిపోయాయి. కాని స్వభావసిద్ధంగా ఏటువంటి లక్షణాలు తనలో వున్నాయని ఇంతకాలం వరకూ స్పష్టంగా తెలుసుకోలేక పోయిందో అవన్నీ ఆమెకు చివరకు అవగతమై తన వ్యక్తిత్వాన్ని గూర్చి తనకు తెలియకుండానే తాను నిర్మించుకొన్న భ్రమలను ఆమె గుర్తింప గలిగింది. సమాజంలో విచిత్రమైన ప్రవృత్తులుగల స్త్రీపురుషు లుంటారనడానికి ఈ కథ అద్వితీయమైన నిదర్శనం. కథలో ఏడో పాత్రలున్నవి. శాంత, కాలేజీలో ఆమెకు పరిచయమైన వ్యక్తులు, ఆమె భర్త లక్ష్మీకాంతరావు, అత్తగారు, మామగారు, తోడికోడళ్ళు, వెంకటం, కాలేజీలో అతన్ని ప్రేమించిన క్రిస్టియన్ అమ్మాయి మొదలైన వారంతా. వీరేగాక కథా నిర్మాణానికి సందర్భోచితంగా వెంకటం వ్రాసిన కొన్ని కథలలోని పాత్రలు. ఆపాత్రలు ఆపాత్రల లక్షణాలు విస్తారంగా పేర్కొనబడ్డవి. ఇన్నిటి మధ్యకూడా కథను dominate చేసింది శాంత, వెంకటం పాత్రలే. ఈ కథలో ప్రత్యేకంగా చెప్పవలసిన మరోవిషయ మేమంటే పాత్రల తత్వాల చిత్రణ కోసం, కథను నడపడంకోసం ఇందులో ఎన్నుకొన్న ప్రతి సన్నివేశం పాఠకుడిలో అత్యంతమైన ఆసక్తిని కలిగిస్తుంది. పద్మరాజుగారు ఆ తత్వాలను చాలా సంక్షిప్తంగా చెప్పారు. అలా సంక్షిప్తంగా చెప్పబట్టే tempo ఎక్కడా దెబ్బ తినక చివరిదాకా కథ రాణించింది. సంభాషణలు crisp గా, కథా గమనానికి Suggestive గా వున్నాయి. పాత్రలచేత అనిపించిన మాటల్లో ఒక్కటీ అనవసర మనిపించదు. పైగా ఏమాత్రైనా తొలగిస్తే సన్నివేశానికి లోటుకూడా కలుగవచ్చు. ఇతర భారతీయ భాషలలోకి అనువదించి, తెలుగులో ఇటువంటి కథ ఒకటి ఉన్నదని దేశీయులకు చెప్పవలసినది పద్మరాజుగారి "ఎదురు చూస్తున్న ముహూర్తం" కథ.

ప్రపంచ కథానికల పోటీలో పద్మరాజుగారి "గాలివాన" కథ రెండవ బహుమతి పొందింది. దీనిలో కథానికా రచనలో భారతదేశం ప్రతిభ వెల్లడి కావడమేగాక విశ్వసాహిత్యంలో తెలుగు కథానికకు గల స్థానం విదితమయింది. పద్మరాజుగారు ఈకథను పోటీకి పంపేటప్పుడే దీనిలో ఉత్తమ కథానికకు ఉండవలసిన లక్షణాలున్నాయనీ, ఏదో బహుమతి రాకపోదనీ ఆశించారు. భారతదేశం మొత్తంలో ఈ కథ రెండవదిగా రావడంతోటే ప్రపంచ పోటీలో కూడా ఇది నెగ్గుతుందనే నమ్మకం వారి కేర్పడింది. అంటే భారతదేశ కథలను గూర్చి వారికిగల అభిప్రాయం అది. వారి ఆత్మ విశ్వాసాన్ని పోటీ ఫలితం ధృవపరచింది. "గాలివాన" కథలో విహేవియరిజం చూపబడిందనీ, పరిస్థితుల ప్రభావంవల్ల మానవుడు ఎలా ప్రవర్తిస్తాడో చూపడమే ఈ కథానిక ముఖ్యోద్దేశమనీ కొందరన్నారు. అయితే ఇది పూర్తిగా నిజంకాదు. కేవలం స్థూలదృష్టితో చేసిన పరిశీలన మాత్రమే ఇది. "గాలివాన" ఒకటికి రెండుమార్లు చదివి బాగా ఆలోచించ వలసిన కథ. ఒక పర్యాయం మద్రాసులో ఒకానొక కళాశాలలో కథా రచయితల సమ్మేళనం ఏర్పాటు చేయబడింది. అప్పుడు ఒకరు "గాలివాన" కథలో వైవిధ్య మేమిటని పద్మరాజుగారిని ప్రశ్నించారు. అందుకువారు "అది కథలో తెలియజేయడానికే వ్రాసినప్పుడు, చదివినాక తిరిగి అదేమిటి అని అడిగితే ఇప్పుడు చెప్పడంకూడా సాధ్యం కాకపోవచ్చు" అన్నారు. నిజంగా ఈ కథనుగూర్చి కథకుడు గాని లేక విమర్శకుడుగాని చెప్పడమంటే అదొక గ్రంథ మవుతుంది. పాఠకుడే దీన్ని మరింత బాగా అర్థం చేసుకుంటాడని నాభావం కూడా.

ఈ కథలో ప్రధానపాత్ర రావుగారు తమ జీవితంలో కొన్ని నియమాలను పాటించాలని నిశ్చయించుకొన్న వ్యక్తి. వాటిని అతిక్రమించకుండా వుండగల సాహసం ఆయనకు వుంది. నీతి నియమాలను గురించి ఆయనకు పిచ్చి పట్టుదల లేదు. కాని మనిషిని దిద్దడానికి కొన్ని నియమాలు ఉండితీరాలని ఆయన అభిప్రాయం. రావుగారు అలా నియమాలకు బద్ధులయిన వ్యక్తి అయినా ఆయనా మానిషే. ఆ మానవత్వం ఆయన తన నియమాలకు అనుగుణంగా వ్యవహరించేటప్పుడే ఒక్కొక్కప్పుడు కొద్దిపాటి ఉల్లంఘనలద్వారా వ్యక్తమవుతూవుంది. తన పిల్లల హృదయాల్లో ఉండే కోరికల ఎడల ఆయనకు సానుభూతివుంది. ఆ కోరికలు తీరడంకూడా వాళ్ళ హృదయ పరిపాకానికి అవసరమని ఆయన అభిప్రాయం. అసలు అనేక విషయాలను గురించి ఆయనకు తీవ్రమయిన అభిప్రాయాలున్నాయి. ఆయన వేదాంతి. వక్త ఆయనకొక సిద్ధాంతం వుంది. వేదాంతం జీవితంతోటే, జీవన విధానంతోటే, వ్యక్తికి సంఘానికి ఏర్పడే రకరకాల సమస్యలతోటే అనుబంధించి వుంటుందని ఆయన వాదం. వేదాంతానికి మరణానికీ నిశితమయిన మానవానుభవాలకికూడా అతీతమయిన విషయాలలోగాని ఏమీ సంబంధం లేదు. ఇటువంటి అభిప్రాయాలుగల రావుగారు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. మార్గ మధ్యంలో తుపానులాంటి గాలివాన వచ్చింది. ఏవో క్రూరశక్తులు విజృంభించి మానవుడు నిర్మించినవీ, దేవుడు సృష్టించినవికూడా భూమిమీద లేకుండా రూపుమాపడానికి పూనుకున్నట్టు అనిపిస్తోంది. ఆ గందరగోళంలో మనః స్థయిర్యాన్ని చేకూర్చే వేదాంతమేదీ రావు [illegible] ఇటువంటి సందర్భంలో ఆయనకో ముష్టిమనిషి తటస్థపడింది. చాలా

చిత్రమయిన మనిషి. వయస్సు ముప్ఫైఏండ్లుంటాయి. ఎవరినైనా సరే ఆమె కిందా మీదా పెట్టేయగలదు. ఆమెకు మనసులో అంతర్లోతుగా ఇష్టాయిష్టాలు లేవు. జరుగుతున్న క్షణంతోనే ఆమెకు సజీవమయిన అనుబంధం. గడచిన కాలపు స్మృతుల బరువుగానీ, రాబోయే రోజులు గూర్చిన ఆశలుగానీ ఆమెకు లేవు. ఆమెననవడి నిర్ణయించే సూత్రాలు లేవు. సూత్రాలలో విధినిషేధాలసలే లేవు. నిత్యమూ ధర్మాధర్మ చింతతో బాధపడే అంతరాత్మగానీ, నాగరికులకు సహజమైన సంకీర్ణ మనస్తత్వంగానీ ఆమెకులేవు. తను ఎన్నడూ ఎరగని మగవాడికూడా ఆమె శరీరాన్ని అర్పించి తేలికైన మనస్సుతో సుఖించగలదు. ఆ మనిషికి రావుగారు రైలులో ఓ డబ్బు ఇవ్వడానికి కూడా నిరాకరించారు. బిచ్చమెత్తుకొనడం మీద రావుగారికి సానుభూతి లేదు. కాని ఆయన రైలు దిగవలసివచ్చేసరికి ముష్టిమనిషి తప్ప ఆయన సామానులు దించేవాడెవరూ లేరు. రాత్రి అంతా ఆయన స్టేషన్ వెయిటింగ్‌రూంలోనే గడపవలసివచ్చింది. గాలివాన ఇంకా తీవ్రమవుతోంది. ముష్టిమనిషి చాలిక దేహాన్ని చూస్తే ఆయన కసహ్యం. కాని ఆ భయంకరమైన రాత్రివేళ ఆమెతోడుగా వుండడమే గొప్ప విషయం అనిపించిందాయనకు. గాలిదెబ్బకు గది తలుపులు ఊడి పడిపోయ్యాయి. రావుగారు ఒక్క గంతువేసి ముష్టి ఆమెను కౌగిలించుకొన్నారు. ఆయన ఆపాదమస్తకం వణకిపోతున్నారు. ఆమె కౌగిలింత వెచ్చదనం ఆయనకి ప్రాణావసరం. మరేమీ ఆలోచించే స్థితిలో లేడు. ఈ దృశ్యంలోనే పద్మరాజుగారు ముష్టిమనిషిచేత ఒక్కమాట అనిపించి భారతీయ కథానిక కుండవలసిన ఉదాత్తతను, పవిత్రతను కాపాడారు ఆ మనిషి అంటుంది: "బాబుగారికి చక్కని కూతుర్నుంటారు యింటికాడ. బాబుగారు ఆరిని తలచుకుంటున్నారు." ఈ మాటలని, ఆమె తన గొడవకూడా చెప్పుకుంటుంది. ఒక మానవహృదయంలోంచి వెలువడ్డ ఆ ఆవేదన వింటూంటే ఆయన హృదయంచుట్టూ పెట్టుకున్న గోడలన్నీ మాయమయ్యాయి. భయంకరమైన ఆ వాతావరణంలో ఇద్దరి శరీరాలు అలసి విశ్రాంతికోరి నిద్రపోయ్యాయి. గాలివాన తగ్గింది. ఆయనలేచి చూస్తే ముష్టిమనిషిలేదు. జేబులో తన పర్సులేదు. గదిలోనుంచి బైటికొచ్చి టికెట్లు అమ్మేగదిలో చూస్తే ఆ మనిషి సామానుకింద చచ్చిపడిపోయివుంది. రావుగారికి చిన్నపిల్లవాడివలె ఏడ్పువచ్చింది. ఆమె చేతిలో ఆయన పర్సువుంది. తన పర్సు దొంగిలించినందుకు ఆమెను ఆయన మనసులో కూడా దూషించలేదు. పైగా ఆమె మృత్యువాత పడ్డందుకు ఆయన తనకు మిగిలిన ఒక్క ఆనందమూ పోయినట్టుగా బాధపడ్డాడు. ఆమె చిలిపితనాలు కొంటెతనాలు ఆయనకు ప్రేమపాత్రాలయ్యాయి. ఆయనలో లోతుగా మాటుపడివున్న మానవత్వాన్ని ఈ జీవి వికసింపజేసింది. ఆమె చేతిలోనుంచి పర్సుతీసుకోవడానికి ఆయనమనసు వొప్పలేదు. తనకు సంబంధించినదేదో ఒక చిహ్నం ఆమె శరీరంతో వుండిపోవాలని ఆయనకు అనిపించింది. కాని ఇతరులు ఆమె దొంగతనం చేసిందని అనుకుంటే ఆయన భరించలేడు. కనుకనే ఆపర్సులోనుంచి తన పేరుగల కార్డు తీసుకొని అక్కణ్ణుంచి వెళ్ళిపొయ్యాడు.

మానవులు ఏర్పాటు చేసుకొనే నీతి నియమాలకీ, వాటికి అనుగుణంగా వారు వ్యవహరించే వైఖరికీ ఆవేవీలేని ప్రాథమికమైన మానవత్వానికీ వుండే అంతరం "గా

వ్యక్తీకరించ బడింది. కొన్ని నీతి నియమాలతో వ్యవహరించడం నాగరికత అనీ, అవి లేక పోవడం అనాగరికత అనీ సాధారణంగా లోకం అనుకుంటుంది. జీవితం సుఖంగా మిట్ట పల్లాలు లేకుండా సాగిపోతున్నప్పుడు మానవుడు చిత్రమైన ఆచారాలు, అలవాట్లు ఏర్పరచు కుంటాడు. జీవితాన్ని గురించి అమితమైన ఉత్సాహంతో మాట్లాడుతాడు. కాని అదే జీవితం భగ్నమయ్యే పరిస్థితి వచ్చినపుడు తానేర్పరచుకొన్న నియమాలు ఎంతటి హాస్యాస్పదమైనవో అతనికి తెలుస్తుంది. నాగరికతా భావనలో, సంప్రదాయాలలో ఆచార వ్యవహారాలలో, నిర్ణీత విలువలలో, ధర్మచింతలో, వేదాంతంలో, కట్టుబాట్లలో ఒక మానవుడికీ మరొక మానవుడికీ గల అంతరం, ఒక జీవితానికీ మరొక జీవితానికీ గల వైరుధ్యం కన్పిస్తుంది. కాని ఇవేవీ ఊహకు రానపుడు ఒక ప్రాణికి కావలసింది మరొక ప్రాణి ఉనికి; ఆ ప్రాణి ఆప్యాయంగా చూపే ఆదరణ. మానవత్వ వాదానికి "గాలివాన" ప్రబలమైన దృష్టాంతం. ఇందుకు పద్మ రాజుగారు కథలో ఎన్నుకొన్న పాత్రలు రావుగారు, ముష్టిఅవిడా తగిపోయినవి. చిన్న కథ అయినా రావుగారి వ్యక్తిత్వం, ముష్టిమనిషి వ్యక్తిత్వం సమంగా విపులీకరించ బడ్డవి. అసలు ఈ కథయొక్క Conception - ఊహించడం - మన కథా సాహిత్యంలో ఒక కొత్త త్రోవ తొక్కినట్లుగా కన్పిస్తుంది. కథలో కొంత పాశ్చాత్య ప్రభావం లేకపోలేదు. అయితే ముఖ్యమైన పాత్రలు, అపాత్రల పూర్వరంగాలు, వాటి ప్రవర్తనలు, కథా సంఘటన, చివరకు పర్యవసానం కూడా దేశీయంగా లేదని అనలేము. ఆదినుంచి అంతందాకా ఏక బిగిని చదివే టట్టు చేసి చదివిన తరువాత ఎంతటి కులాసా మనిషి అయినా ఒక్క క్షణం వైరాగ్యంపొంది మానవ జీవితాన్ని గూర్చి దీర్ఘంగా ఆలోచింపజేసే కథ "గాలివాన." వ్యక్తికీ, వ్యవస్థకీ అను గుణ ప్రవహించే ఒక సనాతనమయిన సార్వజనీనమయిన జీవము ఆ వ్యక్తిలో వ్యవస్థలో పద్మరాజుగారు ఈ కథ ద్వారా చూపించ గలిగారు.

కథలలో ఆదర్శాలకోసం వ్యక్తులను సృష్టించడం, లేదా సామ్యవాద సిద్ధాంతాలు నిరూపించాలనే సూత్రం పద్మరాజుగారికి ఇష్టంలేదు. ఆ విషయాన్ని వారు స్పష్టంగా చెప్పారు. ఒక వ్యాసంలో, ఆదర్శాలకోసం వ్యక్తులను సృష్టించడాన్ని వారు బలహీనత అంటారు. అవి ఆదర్శ చిత్రాలు మాత్రమే. వాస్తవికాలుకావు. అసలు కథకుడు కథలోని ఒక పాత్ర యెడల సానుభూతిని మించిన భక్తి గౌరవాలు కనబరచి నట్లయితే కథ తేలికై పోతుందంటారు వారు. ఆమధ్య ఆంధ్ర దేశంలో కథలలో సామ్యవాద సిద్ధాంతాలు, ఇంకా ఇతర సిద్ధాంతాలు నిరూపించాలనే సూత్రం ఒకటి విరివిగా తలయెత్తింది. ఆ విషయమై పద్మరాజుగారి అభిప్రాయం ఇది : "కథకుడు సామ్యవాది కానక్కరలేదు. అసలు ఏవాదీ కానక్కరలేదు. అతడు సంఘ వ్యక్తిగా సామ్య వాదాన్ని గౌరవించ వచ్చును. కాని కథలో ఒక ధనవంతుణ్ణి దుర్మార్గునిగా చిత్రించినందువల్ల సామ్యవాదానికి గొప్పదనం రాదుగదా, కథలో విలువ చచ్చిపోతుంది. ఇందుకై గోర్కీ రచనలు తార్కాణాలు. అతని దృష్టి విశాల మైన, అవ్యక్తమైన మానవ ప్రపంచాన్ని సూక్ష్మంగా పరీక్షిస్తుంది. ఆదర్శాలను ఆత్మగతం చేసుకొని కూడా, ప్రస్తుత లోకాన్ని చనువుతో, సానుభూతితో దర్శింపగలవాడే రచయిత ... యోపాత్రాను ప్రేమించగలగడమే షేక్స్పియర్ విశేషత. రష్యాలో విప్లవానం

తరం కూడా ఆస్తిమీద వ్యామోహం కనబరచే ధనికులను అర్థం చేసుకో గలగడమే గోర్కీ గొప్పతనం".

పై విషయాన్ని దృష్టియందుంచుకునే కాబోలు, పద్మరాజుగారు "వాసనలేని పూలు" అనే కథను రచించారు. ఈ కథకి పై ఒక్క విషయంతోనేగాక, మానవుని శారీరక, మానసిక సమస్యలతో కూడా కొంత సంబంధం లేకపోలేదు. ఇందులో కథానాయకుడు రాజారావు. అతని భార్య అకస్మాత్తుగా ఆత్మహత్య చేసుకొంటుంది. అసలు వాళ్ళిద్దరి దాంపత్యం అనుకూల మైనది కాదు. ఇద్దరూ వేర్వేరు తత్వాలు గలవారు. అతను ఆదర్శవాది. కవి. అలౌకికుడు. కాని ఆమె కేవలం స్త్రీ. రాజారావు ఆధ్యాత్మికంగా సామ్యవాది కూడా. భార్య వియోగానంతరం తన ఖండికావ్య సంపుటిని ప్రకటిస్తూ దానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో ఇలా అంటాడు.

"కవి (రచయిత కూడా అనవచ్చు) యొక్క అనుభూతులే అతని సత్యాసత్యాలను నిరూపించాలిగాని కొన్ని బాహ్య సిద్ధాంతాలు కాదు. ఈ జగత్తులో ఆర్థిక సమస్యలు లేవు. ఆధ్యాత్మికమైన సమానత్వం అన్నిటికంటె గొప్పది. సామ్యవాది స్నేహితులందరూ దీన్ని గమనించాలి. . నా భార్యను నేను ప్రేమించాను. అయితే ఆమె దేహ సౌష్ఠవాన్ని కాదు. ఆ దేహ సౌష్ఠవం నాకు ఎంతో ప్రతిబంధకంగా అయిపోయింది. కాని ఆమె ఆత్మ విచిత్రమైనది. అనంతమైన ఎర్రరంగు దానికి సాంకేతికం- వాసనలేని ఎర్రరంగు. ఆమెకు విశాలమైన సంస్కారాలు లేవు. కాని ప్రాథమైన స్వభావం ఏదో ప్రబలంగా ఆమెలో ఆవరించి ఉంది. మా వాకిట్లో నిత్యమూ పూసే అద్భుతమైన వాసనలేని ఎర్రపూవులకూ ఆమెకూ ఏదో ఆత్మీయమైన అనుబంధం వుందని నాకు తెలిసివచ్చింది. ఇది అనుమానంకాదు. పరమ సత్యం. నావల్ల ఆమె వైవాహిక జీవితం పండిపోయిందో ఏమో ! అయితే ఎవరికి ఏం కావాలో స్పష్టంగా వారికైనా ఈ సృష్టిలో తెలియడానికి వీలులేదు. ఆమె పోయిన తరువాత నాకొక అపురూపమైన దివ్యమూర్తిగా అయిపోయింది."

కథానాయకుడు రాజారావు వ్రాసిన పై ఉపోద్ఘాతాన్ని పేర్కొన్న తరువాత పద్మరాజుగా రంటాడు .

"రాజారావు ఆధ్యాత్మికంగా సామ్యవాది. వాసన అనే సంపదను అన్ని పువ్వులు సమంగా పంచుకోవడం న్యాయమని అతని మనస్సులో అభిప్రాయం. అన్ని పువ్వులకు వాసనఉన్నా లేకపోయినా ఈ ఒక్క రకం పూవులకు వాసన ఉండే అతని సామ్యవాద సిద్ధాంతాలకు అఘాతం కలగకపోను. ఈ పువ్వుల ద్వారా అతనికి ఈలోకంలో పంపకపు విధానం అసందర్భంగా ఉందన్న సత్యం అనుభవంలోకి వచ్చింది."

సిద్ధాంతాలు ఆధారంగా వ్రాయబడిన కథలవు తాత్కాలికంగా ఏమైనా ప్రయోజనం వుంటుందేమోగాని ఒకప్పటికి అవి ఆ కథకునికే అసంతృప్తికరంగా తోస్తాయి. చివరకవి ప్రచార సాహిత్యంగానే పరిగణింప బడుతాయి గాని సాహితీమూల్యం వాటికి దక్కదు. కాబట్టి పనిగట్టుకొని కథకుడు ఒక సిద్ధాంతాన్ని, ముఖ్యంగా రాజకీయ సిద్ధాంతాల్ని ఆసలు ప్రచారం చేయకూడదు. అది అతని ప్రతిపత్తికి ఏమంత దోహదకారి

కథరాయడానికి పద్మరాజుగారు ఒక సూత్రాన్ని అనుసరిస్తారు. ఏ విషయం గురించి కథ వ్రాసినా ఒక వైవిధ్యం వుండాలనీ, రెండు భావాలమధ్య లేక రెండు పరిస్థితులమధ్య లేక పాత్రలమధ్య వైరుధ్యం, వాటి సంఘర్షణా వర్ణించడం; విపరీత ప్రవృత్తుల సంఘర్షణో సమన్వయమో చిత్రించడం, ఇది వారు పెట్టుకున్న పద్ధతి. ఈ సూత్రంప్రకారంవారు అనేక కథలు వ్రాశారు. వాటిల్లో "ఎదురుచూస్తున్న ముహూర్తం" "గాలివాన" మొదలగువాటిని మనం లెక్కలోనికి తీసుకోవచ్చు. ఇంకా మరికొన్ని కథలుకూడా ఈ సూత్ర ప్రకారమే కన్పిస్తాయి. తాము పెట్టుకున్న సూత్రాన్నిగూర్చి ఒకమారు పద్మరాజుగారే ఇలాచెప్పారు. "గొప్పవిగా అంగీకరించబడ్డ కథలలో చాలాభాగం పాశవికమైన, అనాగరకమైన మానవస్వభావాన్ని చిత్రిస్తాయి. ఆ మానవస్వభావం ప్రస్తుత వైజ్ఞానిక ప్రపంచానికి కూడా అడుగునవున్న తత్వం. యుగయుగాలు గడచిపోయినా, నమ్మకాలు మారిపోయినా మనకి అర్థంకాని తత్వం ఒకటి లోకంలో మిగులుతూనే వుంటుంది. ఆ తత్వానికీ మనిషియొక్క వైజ్ఞానిక బుద్ధికీ వ్యత్యాసం ఉండితీరుతుంది. అటువంటి వ్యత్యాసమే కథారచనకు మూలవస్తువు. ఒక తీక్ష్ణమయిన వ్యత్యాసాన్ని గుర్తించినపుడుగాని కథపుట్టదు. అభిరుచిని విజ్ఞానాన్ని సేకరించి సంఘంలో ప్రధాన వ్యక్తులైనవారిని గురించి కథలు రాయడానికి సావకాశం తక్కువ. వారి బుద్ధివికాసమే వారి మనఃప్రవృత్తులను కొంతవరకు అణచి ఉంచుతుంది. అందువల్ల కథలు వారికి ఏర్పడవు. ఇక సంఘంలో మిగిలిన మార్పులేని పెంకితత్వాలు నవనాగరికతా ఫలితంగా విపరీతమైన చిత్తవృత్తులను ప్రదర్శిస్తాయి. కాలంయొక్క గతితోపాటు మారడం అలవాటు చేసుకోలేక ఎదురు తిరిగే ఒకరకం తత్వాలలో అనంతంగా కథలు సృష్టి అవుతాయి, కథారచనకు ప్రధానమైనది ఈ నాగరిక ప్రపంచానికి కూడా అడుగునవున్న అసంస్కృతికత. ఇటువంటి విభిన్నవ్యక్తుల లోనూ అసంస్కృతికంగా మిగిలిన చిత్తవృత్తులకు విచిత్రమైన సాదృశ్యం కథకుడు నిరూపించాలి. ఎంతచదువున్నా, ఎంత నాగరిక వ్యక్తులైనా ప్రధానంగా మిగిలే అసంస్కృతికత మనకి వింతగా కనబడుతుంది. అందుచేత కథకులు అనాగరిక లోకాన్నే పరీక్షించాలి. నాగరక సంఘంలోని అనాగరకతను గుర్తించాలి. దానితో తాదాత్మ్యం పొందాలి."

కాబట్టే పద్మరాజుగారి కథలలో పాత్రలు విలక్షణంగా ఉంటాయి. సమాజంలో అపురూపమయిన వ్యక్తులు వీరి కథలలో కనిపిస్తారు. పాత్రలలో ప్రత్యేకత ఉంటేనే ఆ కథ చదువరిలో శాశ్వతప్రభావం వేయగలుగుతుంది.

ఉత్తమకథకు ఉండవలసిన అనేక లక్షణాలలో భాషకూడా ఒక్కటి. ఒక్కొక్క కథకుడు ఒక్కొక్క వడిలో, శైలిలో వ్రాసి పాఠకులలో ఇట్టే చొచ్చుకుపోతాడు. కథానికకు ఒక విలక్షణమయిన భాష వాడడం కథకుడు త్వరగా వ్యాప్తిలోనికి రావడానికి వీలవుతుంది. ఈ విషయాన్ని కొత్త కథకులు ఈనాడు సరిగా గుర్తిస్తున్నట్లులేదు. ప్లాటు బాగావుంటే చాలు, శిల్పంబాగావుంటేసరి, కథ ఎలాగైనా చెలామణీ అవుతుందనే భావంతో కొందరు కథకులు ఇష్టమొచ్చిన భాష వ్రాసేస్తూ ఉంటారు. కాని పాఠకుడు భాషకు కూడా విలువ ఇస్తాడన్న విషయాన్ని గుర్తించాలి. ఇంగ్లీషు కథానికా రచయితలలో సోమర్‌సెట్ మామ్ [illegible] సాధ్యులబడు. ఇతను ప్రఖ్యాత కథారచయిత. అనేక నవలలు కూడా వ్రాశాడు.

నోబెల్ బహుమానం పొందనర్హత గలిగే కథాసాహిత్యాన్ని సృష్టించాడు. ఇటువంటి రచయితే భాషవిషయంలో ప్రతిభ, ప్రత్యేకత చూపలేక కొందరు విమర్శకుల తీవ్రవిమర్శకు గురి అయ్యాడు. ఎడ్మండ్ విల్సన్ అనే ప్రఖ్యాత అమెరికన్ సాహిత్యవిమర్శకుడు సోమర్‌సెట్ మామ్‌నుగూర్చి అభిప్రాయమిస్తూ "మామ్ సెకండ్‌రేట్ (రెండవశ్రేణికి చెందిన) రచయిత. అతనిభాష ఎరువు తెచ్చుకున్నట్లుగా వుంటుంది. అందులో చెప్పుకోదగ్గ విశిష్టతేమీవుండదు. అతను వ్రాసేది సగంచెత్త. చాలా చెడ్డగా వ్రాస్తాడు. అయితే సాహిత్యాన్నిగూర్చి అంతగా పట్టుదిలలేనీ, రచన అంటే నిర్దిష్టాభిప్రాయాలు లేనీ పాఠకులు ఇతని రచనలు చదివి ఇతనికొక ఆశ్రయం కల్పిస్తున్నారు" అన్నాడు. మామ్ అంతటి గొప్ప కథకుడే ఇలా తెగనాడబడితే ఇక సాధారణుల సంగతేమిటి? కాబట్టే ప్రతిభగల కథకుడు తన భాషకొక శైలిని ఏర్పరచుకొనితీరాలి. పద్మరాజుగారి విషయంలో అధికమయిన శ్రద్ధవహిస్తారు. అయినా అక్కడక్కడా వీరు వ్రాసేవాక్యాలు ఇంగ్లీషులో ఊహించి సరిగా అదేభావనను తెలుగులో పెట్టినట్లుగా కన్పిస్తుంది. ఇందుకు కారణం లేకపోలేదు. వీరు బెనారెస్ విశ్వవిద్యాలయం నుండి వచ్చిన తరువాత మొదటిరోజుల్లో ఇంగ్లీషుభాషలో కథవ్రాసి "త్రివేణి" పత్రికకు పంపారు. అప్పుడా పత్రికకు సంపాదకులుగా వ్యవహరిస్తున్న బుర్రా సుబ్రహ్మణ్యంగారు ఆ కథను స్వీకరిస్తూ ఇకపైన కథలు తెలుగులోనే వ్రాయండని పద్మరాజుగారిని కోరారు. ఈ విషయాన్ని ఒకసారి పద్మరాజుగారే ఇలా చెప్పారు. "ఇంగ్లీషు పరిచయం కలిగిన పిమ్మట మాబోటివారికి ఊహలు కూడా తెలుగులో పుట్టడంలేదు. ఇంగ్లీషులో భావించి తర్జుమాలు చేస్తున్నాం." అయినా ఇవి ఎక్కడో నిశితంగా పరిశీలించిన మీదటగాని బైటపడవు. పోతే ఒక్కొక్కచోట కథా కథనంలో, వర్ణనలో ముఖ్యంగా ప్రకృతివర్ణనలో ఈయనచూపే కౌశలం, పటితనం అనన్యసామాన్యంగా వుంటుంది. ఉదాహరణకు "జీవితం బరువుగా అక్కడ కూర్చుని ఆలోచించుకుంటూ చుట్ట కాలుస్తున్నట్లుంది" - "ఎండ దాహంగా పెరుగుతోంది" "గాలి అవతల అరుస్తోంది" - "రైలు వానపాములా పాకుతోంది" - "ఆమె పెదవులు ఇంకా విచ్చుకొని గులాబీమొగ్గల్లా ఉంటాయి"- "ఆమె గుండెలు గొంతుకలో కొట్టుకుంటున్నాయి"- "అవసరం తీరుతుండే వెళ్ళేందుకు?" - "అతను కళ్ళు సన్నగాచేసి ఆమెవైపు చూశాడు" - "ఆమెకూడా నవ్వుతూ త్రిప్పుకుంటూ అతనితో కలుస్తుంది" - "లోపలి చీకటికి కళ్ళుకాస్త అలవాటుపడ్డాక" - "పొద్దుగుంకిన తరువాత లోకమంతా దిగులుగావుంది" - ఇలాగే "గాలివాన" కథలో రావుగారు నియమాలప్రకారం నడుచుకొనే వ్యక్తి అని చెప్పడానికి పద్మరాజుగారొకచోట "రావుగారికి తనకు ఆకలివేస్తున్నట్లు జ్ఞాపకం వచ్చింది" అని వ్రాశారుగాని "రావుగారికి ఆకలివేసింది" అనలేదు. ఆకలి వేసినా వేయకపోయినా ఆకలి అయ్యేవేళను మాత్రం రావుగారు పాటిస్తారని చెప్పడం యిది. అలాగే రావుగారు తమ ఉపన్యాసాల శీర్షికలను శబ్దాలంకారాలను బట్టి నిర్ణయించుకుంటారుగాని అర్థస్ఫురణనుబట్టి కాదు. అయితే ఆ శీర్షికలను ఎవరైనా విమర్శిస్తేమాత్రం ఆయనగారు ధ్వనినిబట్టి అర్థం అనుసరిస్తోందని చెబుతారు. అలాంటి శీర్షికలలో రావుగారు సరిపెట్టుకొన్నవి. "సత్యము - తత్వము", "ప్రకృతి - పరిష్కృతి", "సామ్యవాదము, సమ్యరసామోదము", "వయోవిపాకము, మనో

ఇవన్నీ ఆయనగారి సూత్రబద్ధమయిన మనస్తత్వాన్ని తెలియజేస్తాయి. పద్మరాజుగారు ప్రకృతిలో లీనమయి తేరుకొని చిత్రించినట్టుగా వుంటుంది. ఆయన ప్రకృతివర్ణన - ఇందుకు ఆయన పరిశీలనాశక్తి, కావ్యాత్మ కారణాలనుకుంటాను. ఏమయినప్పటికీ ఇటువంటి వాక్య ప్రయోగాలు, వర్ణనలు సునిశితమయిన బుద్ధిగల పాఠకుణ్ణి మరింత ఊపివేస్తాయి. ఈ చిత్రీకరణలు కథను మరింత పటుతరం చేస్తాయి. పద్మరాజుగారిలో ఈ శక్తి అపారంగావుంది. కథకుడుగా పద్మరాజుగారి వర్ణనా వైదుష్యాన్ని, సరికొత్త వాక్యప్రయోగాన్ని, చూడాలనుకుంటే "కూలీజనం" కథల సంపుటి ప్రమాణంగా కన్పిస్తుంది.

నేటి తెలుగు కథానికా రచన పాశ్చాత్య వాఙ్మయాన్ని అనుసరించి సాగుతున్నదన్న విషయాన్ని పద్మరాజుగారు అంగీకరిస్తారు. వారి కథానికా రచనకు ప్రోత్సాహ మిచ్చింది ఇంగ్లీషు కథల నమూనాలే. అందుచేత యిది జాతీయం కాదని వారి ఉద్దేశం. తాము వ్రాసిన కథలు చదువుకొన్న వారికేగాని పామర జనానికి నచ్చుతాయని వారనుకోరు. అందుచేతనే ఒక పర్యాయం బెంగాలీ నవలా రచయిత శరత్‌బాబు విషయం ప్రస్తావిస్తూ "ఆయన నవ భావాలు కలిగి, పతితులతో తిరిగి వారి బాధలు తెలుసుకొని, చిత్రమయిన ప్రవృత్తులు పట్టుకొని ప్రతి వ్యక్తికి అందుబాటులో నున్న పాత్రలను సృష్టించాడు. అవి విద్యావంతులకీ, చదువుకొనని వాడికి కూడా నచ్చుతాయి. తెలుగులో అట్టివి వ్రాయగల వాడుంటే అతణ్ణి గౌరవించాలి. ఏనాటికైనా అలాంటివి వ్రాయగలిగితే చాలని ఆశిస్తున్నాను" అన్నారు. నిజం చెప్పాలంటే శరత్‌బాబులాంటి కథకుడు ఆంధ్రలో ఇంకా రాలేదు. కాబట్టే శరత్‌బాబు అనువాదాలకి ఆంధ్రదేశంలో గిరాకీ ఎక్కువగావుంది. శరత్‌బాబులాంటి వ్యక్తి వచ్చాడంటే ఆనాడు మనకు శరత్‌బాబు అనువాదా లక్కరలేదేమో.

తెలుగు కథానికా రచనలో తమకుగల అనుభవాన్ని పురస్కరించుకొని పద్మరాజుగారు కొత్తగా కథలు వ్రాయబూనుకునే వారికి ఒక సందేశం కూడా ఇచ్చారు. వారంటారు: "ఇంగ్లీషు రానివారు జాతీయ భాషను ఎట్లా వ్యక్తీకరిస్తారో అందులో మాండలిక భేదాలేమిటో తెలుసుకొని ఆ పదాలు క్రోడీకరిస్తే ఉపయోగం వుంటుంది. కథలుచెప్పే అలవాటు ఇండ్లలో ముసలివాళ్ళ కుంటుంది. మా బామ్మ కథ చెప్పగలిగినట్టు నేను కథ వ్రాయగలిగితే ప్రపంచాన్ని జయించ గలుగుతానని ఒక్కొక్కప్పుడనుకుంటూ వుంటాను. మనం కథలు రాసేటప్పుడు మన పూర్వీకులు చెప్పే కథలను మననం చేసుకోవాలి. ఆ కథలు, పాత్రలు, వాటిని చెప్పడంలో ఉండే సొగసు మనస్సుకి పట్టించుకోవాలి. వాటినుంచే మనం కథా రచనకు పద్ధతిని నిర్మించుకోవాలి. ఆ పాత సంప్రదాయమే మనకు విశిష్టమైన సాహిత్య సంప్రదాయాన్ని ఇవ్వగలదు గాని ఇతర భాషల కథలను అనుకరించినందువల్ల ప్రయోజనంలేదు. మన నాగరికతకు చరిత్రవుంది. దాన్ని విడిచి మనం సాముచెయ్యలేము. మనం వొదుల్చుకోలేని విశ్వాసాలు మనని వెన్నాడు తున్నవి. వాటిని ఏవగించుకొని మనం సంప్రదాయాన్ని సృష్టించలేము."

విశ్వసాహిత్యంలో తెలుగు కథానిక స్థిరమైన విలువ పొందాలంటే మన కథకులకు ఆదర్శం అనుసరణీయం.



కవిత :

# సంధ్యారాగము

— శ్రీ వాత్సవ

బెదఱిన యామినేడివలె బిక్క మొగమ్మున జాలి చూపుతో
ఎదురగు నీ నెలంతుక అదేల పదేపదే చంచలించెడిన్
చెదరిన ధైర్యమో ఉపవసించిన యౌవనమో హఠాత్తుగా
చెదిరిన రాగబంధనమొ కొంచల మంచగ జేసె నమ్మమా ?

ఊహల కందరానివి యహో కవులేని వచింపలేని సం
దేహపు భావగీతుల ప్రతిక్షణ చంచల చంచలా కృతుల్
దాహము తీర్పజాలని విదగ్ధ వధూజన ఫీమరీచికల్
స్త్రీ హృదయాంతరాంతర నిషిష్ఠ మనోహర వాంఛితార్థముల్.

హృదయము పాఱవైచుకొని యెక్కడికో చను బాటసారితో
సదయత పల్కరించెను ప్రసన్న కథాచతురార్థ యుక్తితో
పదిలము చేసికొన్నదెవ భావము తెల్పకె; ముద్దరాలపై
పెదవి కదల్పకే హృదికపించెడు భాష వచింప నేర్చెగా !

చిరునవ్వుల్ ప్రసరించు నెమ్మొగముతో స్నేహానురాగమ్ముతో
పరికించున్, పలికింప చెంత చెలితో పల్కాడు తన్ గానటుల్
సరసన్ చేరినయంత త్రుళ్ళిపడు లజ్జాభ్రాంత చిత్తమ్ముతో
చెరగున్ మార్పు నెపమ్ముతో నిలచు అస్వీకారమో ? గారమో ?

ప్రణయామోదము సంతలో వెలకు సంపాదించు సామగ్రి కా
దనురాగాత్మ తనంత తా నొసగు అప్యాయ ప్రసూనమ్ము ; చే
సిన పుణ్యమ్ముల సంచితార్థము కటాక్షించన్ లభించున్ గదా
తన స్వప్నమ్ము నిజమ్ము చేయగల కాంతాస్నేహ స్సౌభా

పరకాంతన్ మొగమెత్తి చూడని దృఢస్వాంతమ్ము నేడేల య
చ్చర కన్నెన్ గనినట్లు బెట్టదరి యస్వాధీన ధైర్యానయ
స్థిరతన్ గుందగవచ్చె; ఈ వయసులో శృంగార మున్మాదమో
రమణీ మానస దర్శనోత్సుక వృథా వ్యామోహ సమ్మోదమో !

ఔననియన్న కాదనుట కర్థము; ఛీయని ఛీదరించుచో
పూనిన రక్తికిన్ స్ఫురణ; మోమటు త్రిప్పి ఛలోక్తులాడుచున్
చానల నమ్మరాదనెడు సామెత; విద్యల నెన్ని నేర్చినన్
కానము కామినీ హృదయ కావ్యరసమ్ము గ్రహించు నేర్పరుల్.

అకటా సర్వ మెరింగినట్లు మగవా రత్యంత గర్వమ్ముతో
మకుటాధీశులపో వలంచెదరు సన్మానమ్ము మౌనమ్ముతో
చికురించన్గల ప్రజ్ఞ నేర్వగలరా ? స్త్రీ జాతికే చెల్లు సా
ర్థకతన్ మించగ; పూరుషుల్ సతులకున్ దాసాను దాసుల్గదా !

తన కనుసన్నమాత్ర నను దాసునిగా నొనరించగల్గు నం
దన యువతీలలామను సదా నిరసించి తిరస్కరించనా ?
తన చిరునవ్వు మెప్పులకు ధన్యుడనై ఘనకీర్తి గాంచి కో
రిన పరమంది నందులకు ప్రీతి కృతజ్ఞత స్వీకరించనా ?

తీయని పాట విన్నయటు తిన్నెల వెన్నెల గాచినట్లుగా
మాయని పూలవాసనలు మందగతిన్ విరజల్లి నట్లు లా
హాయనిపించు స్త్రీ పరిచయ మ్మొకటైనను చాలు జన్మకున్
బాయని జ్ఞాపకాల పరువమ్ములు జీవితమెల్ల చిమ్మగా.



నాటిక :

# ఓటమి తరువాత

మూలం : శ్రీ స్టైన్‌బెక్

అనువాదం : శ్రీ చావలి రామచంద్రరావు

(గత సంచిక తరువాయి)

## మూడవ దృశ్యం

*(మేయర్ భోజనపుగది. ఏనీ, జాన్ యిద్దరూ ఒక మూలంగా వున్న ద్రాయరు తుడుస్తున్నారు.)*

ఏనీ : జాన్ ! జాగ్రత ! దానికాలు ఊడిపోయేను !

జాన్ : యిది ఎప్పటిదో పురాతనమైన ద్రాయరు ఏనీ !

ఏనీ : దీన్నిప్పుడు ద్రాయరును యిక్కడుంచిన కారణమేంటో ?

జాన్ : లోమెజా భర్త హారెస్ కెప్టెన్ ఫిష్టని కత్తితో పొడిచేశాడు. యివ్వాళతనికి కోర్టుమార్షల్ జరుగుతుంది.

ఏనీ : ఈ గదిలోనా ?

జాన్ : ఈ గదిలోనే.

ఏనీ : మరి మేయర్‌గారో ?

జాన్ : వారు నిస్సహాయులు. వారు చెయ్యగలదేముందీ ?

ఏనీ : కాని ప్రజలది సహించరు. (ఆగి) నేనుమాత్రం సహించలేను.

జాన్ : ఏంచేస్తావ్ నువ్వు ?

ఏనీ : నలుగురైదుగురు సిపాయిల్ని ఖైమాచేస్తాను.

(పాదాల చప్పుడు)

జాన్ : యిష్ ! మేయరుగారొస్తున్నారు.

ఏనీ : డాక్టరు కూడా వెంటే ఉన్నారు. (ఆగి) అరె ! లోమెజా కూడానూ ? ఆమె యిక్కడికి ఎలావచ్చింది ? ఏంపనొచ్చిందో ? ఎంత చక్కటిపిల్ల !....ఎంత అభాగ్యురాలవమ్మా లోమెజా !

*(మేయర్, డాక్టర్, లోమెజాలు ప్రవేశిస్తారు. లోమెజా ఒక అందమైన యువతి. ఆమె విశాల నేత్రాల్లో విషాద, నిరాశలు తాండవిస్తున్నాయ్).*

మేయర్ : ప్రజ లేమనుకుంటున్నారు లోమెజా !

లోయెజా : శత్రుసైన్యానికి సంబంధించిన ఒక ఆఫీసరును హత్యచేసిన నేరానికి వేయబడే శిక్ష తమ అనుమతితోనే అమలు జరుగుతుం దనుకుంటున్నారు ప్రజలు.

మేయర్ : ప్రజ లీమాట ఎలా అంటున్నారూ ! (బాధగా) నేనీ పని ఎలాచెయ్యగలుగుతాను డాక్టర్ ! ప్రజలు నన్ను విశ్వసించటంలేదు. శత్రువులు కూడా నన్ననుమానిస్తూనే ఉన్నారు. నే నేంచేసేది డాక్టర్ !

ఏనీ : లోయెజా భర్తచేసిన అపరాధ మేమీలేదు. అతను చాలా యోగ్యుడన్నవిషయం నగరంలో అందరికీ తెలుసు.

జాన్ : అయ్యా ! హోరెస్ తండ్రిగారు మున్సిపల్ బోర్డులో సభ్యులుగాకూడా ఉన్నవారు.

ఏనీ : (ప్రార్థనా పూర్వకంగా) ఆయనగారు క్రిందటి క్రిస్మసుకు లోయెజాకొక ఎర్రని సిల్కుగౌనుకూడా బహూకరించారు సార్ ! నాకు బాగా జ్ఞాపకం.

(లోయెజా కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి. జాన్ బయటకు వెళ్ళిపోతాడు.)

మేయర్ : నేనతన్ని శిక్షించాలనుకుంటున్నానని ఎవరన్నారు నీతో ? అతన్నెందుకు శిక్షించాలి నేను? అతను తనదేశానికి గాని, జాతికిగానీ ద్రోహమేంచెయ్యలేదే !

లోయెజా : మేయర్ !....అయితే వాళ్ళు....వాళ్ళు నా భర్తను కాల్చేస్తారా ?

(మేయర్ మౌనం చూచి లోయెజా వెక్కివెక్కి ఏడుస్తుంది.)

మేయర్ : అమ్మా లోయెజా !. నా చిట్టి తల్లీ !

లోయెజా : (అకస్మాత్తుగా) నన్ను తాకకండి. నన్ను తాకకండి ..వెళ్లుతున్నాను నేను.

(వడివడిగా అడుగులు వేస్తూ వెళ్ళిపోతుంది)

మేయర్ : (విచారంగా) జాన్ ! ఏనీ ! మాదామును పిలు త్వరగా.

జాన్ : కర్నల్ మిమ్మల్ని కలుసుకోటానికి వచ్చారు సార్ !

(జాన్ వెళ్ళిపోతాడు కర్నల్ ప్రవేశిస్తాడు.)

కర్నల్ : మీరే స్వయంగా మీ అధ్యక్షతతో హోరెస్‌కు మరణశిక్ష విధించాలని నాకోరిక. కెప్టెన్ ఫ్రిస్ట్‌ని హత్యచేశాడతను. విషయమంతా వినే ఉంటారు మీరు.

[illegible] : (వినన ట్లుగా) హోరెస్ ఎక్కడున్నాడు ?

కర్నల్ : మే మతన్ని అరెస్టుచేశాం. అతన్నిప్పుడే యిక్కడికి తీసుకొస్తారు.

మేయర్ : హారెత్‌కు నేను మరణశిక్ష విధించలేను.

కర్నల్ : కారణం ?

మేయర్ : నేనీ నగరానికి మేయరును. మా దేశరాజ్యాంగ చట్టప్రకారం నాకు మరణశిక్ష విధించే అధికారం లేదు. ఐనా ఈ విషయం నాకెందుకు చెప్పటం ? నా కిప్పుడేమీ అధికారాలు లేవని మీకూ తెలిసిందే.

కర్నల్ : శిక్ష మీరు గనుక విధించితే ప్రజలమీద మంచి ప్రభావం కలిగిస్తుందది. శాంతి నెలకొంటుంది. నేను ఎక్కువమందిని కాల్చివేయవలసిన అవసరం ఏర్పడదు. హత్యచేసిన వ్యక్తి శిక్షింపబడితీరాలి. చట్టం చెప్పేదికూడా అదే!

మేయర్ : నేను హారెత్‌కు శిక్షవిధిస్తాను. ఐతే ఒక్క షరతుంది. మా నగరంపై ఆక్రమణ కాలంలో మా సైనికుల ప్రాణాలు తీసినవారిని మీరుకూడా శిక్షించండి.

కర్నల్ : మీరు పరిహాసమాడుతున్నారు.

మేయర్ : యిది పరిహాసం కాదు. పరిహాసమాడేది మీరు. మీరు మా నగరం మీద దాడి చేస్తారు. మా సైనికుల ప్రాణాలు తీస్తారు. వీరిని హత్యలనరు ఏమంటారు ? అందుకు శిక్ష మరణం తప్ప మరేముంటుంది ? యిక చట్టమంటారా ? మీరు ప్రస్తావించేది ఏ చట్టం? మీకూ, మాకూ మధ్య యిప్పుడు చట్టమేమిటి ? యిప్పుడు మిగిలిందల్లా ఒకటే చట్టం - యుద్ధ చట్టం. మీరు మమ్మల్నైనా నష్టపరుస్తారు ; మేము మిమ్మల్నైనా నష్ట పరుస్తాం. యిది అంతిమ నిర్ణయం.

కర్నల్ : నేనీ కుర్చీమీద కూర్చోవచ్చునా ?

మేయర్ : యిది మరో అబద్ధం. "నేనీ కుర్చీమీద కూర్చోవచ్చునా?" అని నన్నెందుకడగటం ? నేనెవరిని ? మీరు తలుచుకుంటే గంటలకొలది నిలబెట్టగలరు నన్ను. ఈ పరిహాసమెందుకూ ?

కర్నల్ : నేను మీ సహకారం కోరుతున్నాను.

మేయర్ : శత్రువు శత్రువుతో ఎలా సహకరిస్తాడు ? మీకూ మాకూ మధ్య యిప్పుడొక క్రొత్త సంబంధం ఏర్పడింది. పాలించేవారికీ, పాలించబడేవారికీ గల సంబంధమది. యజమానికీ, బానిసకూ గల సంబంధమది. గర్వానికీ, ద్వేషానికీగల సంబంధమది. ఈ సహజ సంబంధాల వలన ప్రాంసుదేశం ఓ

అల్లుకుపోతున్నాయి. గాయపడ్డ నా మాతృదేశ హృదయంలో ప్రతీకార భావాలను ప్రబలతరం చేస్తున్నాయి. నేను చావటానికైనా సిద్ధపడతాను గాని హారెత్‌కు మరణశిక్ష విధించలేను.

కర్నల్ : (*సిగరెట్ ముట్టిస్తూ*) హూం ! (*ఆగి*) యిప్పుడిక బారెల్‌ను మేయర్‌గా నియమించక తప్పదనుకుంటాను. (*ఆగి*) మరోమార్గం లేదు. మీరు కోర్టు మార్షల్ సమయంలో యిక్కడే ఉంటారా ?

మేయర్ : ఔను ! ఉండాలనుకుంటున్నాను. పాపం ! హారెత్‌ను ఓదార్చటానికైనా వీలుంటుంది.

కర్నల్ : ఒకసారి తిరిగి ఆలోచించుకోండి. (*కఠిన స్వరంతో*) ఈ రక్తపాతం తిరిగి ప్రారంభం కారాదని నా కోరిక.

(*మేయర్ వెనుకకు తిరిగి పెద్ద కిటికీవద్దకు వెళ్ళి నిలబడి బయటిదృశ్యం చూస్తుంటాడు*).

మేయర్ : (*క్రోధం ఏమాత్రం లేని స్వరంతో*) బయట మంచుకురుస్తోంది కర్నల్ ! (*ఆగి యిటుతిరిగి కర్నల్‌ను చూస్తూ*) కొంచెం ఈ కిటికీగుండా తొంగి చూడండి ! ఎంత తెల్లగా, అందంగా, మనోహరంగా పడుతోందో మంచు ! (*కర్నల్ మెదలక నొప్పకుంటూ లేచి కిటికీవైపుకు వెళ్తాడు.*)

నాలుగవ దృశ్యం

[*అదేగది దాని వాస్పిరోజు సైనికన్యాయస్థానంగా మార్చారు. తెల రేపు నప్పటికి హారెట్ కోర్టుమార్షల్ జరుగుతుంటుంది. కెప్టెన్ విలియమ్ హారెత్‌పై మోపబడిన అభియోగం చదివి వినిపిస్తుంటాడు.*]

విలియమ్ : (*చదువుతూ*) యిందుమొదట గూడా హారెత్ ఏమీ లక్ష్యపెట్టలేదు. పైగా ఖండితంగా నిరాకరించాడు. హారెత్‌ను బొగ్గుగనిలో పనిచేయమని ఆదేశించగానే హారెత్ ముందుకురికి కెప్టెన్ విలియమ్‌పై దాడి చేద్దామనుకున్నాడు. కెప్టెన్ ఫ్రిట్జ్ అడ్డువచ్చి విలియమ్‌ను రక్షించుదామని ప్రయత్నించగా కత్తి ఫ్రిట్జ్ గుండెల్లో గ్రుచ్చుకుపోయింది. (ఆగి) డాక్టర్ రిపోర్టుకూడా దీనితోనే చేర్చబడిఉంది. అదికూడా చదవమంటారా ?

కర్నల్ : (*న్యాయస్థాన అధ్యక్షుడు*) అవసరంలేదు. ఇది త్వరగా పూర్తిచెయ్యి.

విలియం : (*చదువుతూ*) ఈ ఘటనంతా చాలామంది సైనికులు చూచారు. వారి సాక్ష్యాలిక్కడ నమోదు చేయబడి ఉన్నాయి. (ఆగి) కెప్టెన్ ఫ్రిట్జ్‌ని హత్య

చేసినవాడు హోరెత్ అని ఈ సైనిక న్యాయస్థానం నిర్ణయించింది. కాబట్టి యితనికి మరణశిక్ష విధించబడ్డది. (ఆగి) సైనికుల సాక్ష్యాలుగూడా చదవమంటారా?

కర్నల్: అక్కర్లేదు విలియం. వాటితో పనిలేదు. (హోరెత్‌తో) హోరెత్! నువ్వేమైనా సమాధానం చెప్పుకొంటావా?

మేయర్: ఈ కుర్రవాణ్ణి మాట్లాడనీ.

విలియం: సైనిక న్యాయస్థానంలో కుర్రవాణ్ణి మాట్లాడటానికి అనుమతి యివ్వటానికి వీల్లేదు.

కర్నల్: పోనీ, మాట్లాడనివ్వండి! అందువల్ల అభ్యంతరం లేదులే.

మేయర్: హోరెత్! నా చిన్నికుర్రా! నువ్వు చెప్పదలచుకున్న సంజాయిషీ ఏమిటో చెప్పు.

హోరెత్: నేను. నేను చెప్పదలచుకున్న దొకటే. నేనీపని మహావేశంలో చేశాను. నేనతన్ని చంపదలచుకోలేదు. నన్ను సైన్యంలో పని చెయ్యమని బలవంతం చేశారు. నాకు పిచ్చికోపం వచ్చింది. నేను ... నేను స్వతంత్రభావాలుగల వ్యక్తిని. అదే పద్ధతిలో పెరిగాను. నేనెప్పుడూ ఎవరికీ బానిసగా బ్రతుకలేను. ఇటువంటి ఆజ్ఞ ఎవరిచ్చినా నేనెప్పుడూ పాటించలేను. నేనతన్నికాదు చంపాలనుకున్నది. అతను అకస్మాత్తుగా అడ్డం వచ్చేశాడు. అసలు నేను చంపాలనుకున్నది విలియంను.

కర్నల్: నువ్వెవర్ని చంపదలచుకున్నావనేది అసలు చర్చనీయాంశమే కాదు. ఒక్కమాట: యిందుకు నువ్వు పశ్చాత్తాపపడుతున్నావా?

హోరెత్: ఎంతమాత్రం లేదు.

కర్నల్: బాబు! యిక చెప్పవలసిన అవసరమే లేదు. నీనేరం రుజువైంది. సైనికులారా! యితన్ని చౌకులోకి తీసుకువెళ్ళి గుండ్లవర్షం కురిపించండి. నగరంలో అన్నిటికంటె పెద్ద సెంటరుకు తీసుకువెళ్లి అందరి ఎదుట తుపాకులతో కాల్చిచంపండి. (ఆగి) కెప్టెన్ విలియం! ఏర్పాట్లన్నీ సరిగ్గా ఉన్నాయా? నేనే విషయం మరచిపోలేదు గదా?

మేయర్: (పట్టుకుండలేక) కర్నల్! మీరు నా విషయం మరచే పోయారు. (ఆగి) హోరెత్: నేనీ నగరానికి మేయరునని తెలుసుగదూ? ఈ నగర ప్రజలు నన్ను ఎన్నుకున్నారు. నిన్ను శిక్షించడంలో నా భాగ

ఉందని ప్రజలనుకుంటున్నారు. వారందరూ ఏమనుకున్నా నేను నిర్దోషి నన్న విశ్వాసం నీకు కలిగితే అంతేచాలు నాకు. ఎందువల్లనంటే నీవు మృత్యుదేవతకు బలి కాబోతున్నావ్. నామాట వింటున్నావా హోరెస్ !

హోరెస్ : (పంచలుపై) వింటున్నాను మేయర్ !

మేయర్ : వీళ్ళు ఆక్రమణదారులు. మనల్ని వీళ్లు జయించారు. — ఎలాగో తెలుసా ? — మోసంతో, కపటంతో, పశుబలంతో.

విలియం : (క్రోధంగా) ఈ విద్రోహ ఉపన్యాసం అనుమతించటానికి వీలులేదు.

కర్నల్ : ఊరుకో విలియమ్ ! యిది స్పష్టంగా వినటం ఎందుకైనా మంచిది. నాలుగు గోడలమధ్య దాగొన్న ప్రజలంతా ఈ ఉపన్యాసం వల్లెవేయటం శ్రేయస్కరమనుకుంటున్నావా ?

మేయర్ : శత్రువులు మనదేశంమీద పడచుకుపోయినప్పుడు పరాజయం అంటే ఏమిటో, పరాధీనత అంటే ఎలా ఉంటుందో, పరరాజ్యానికి అర్థమేమిటో ప్రజలు కల్పించలేరు. వాళ్ళు ఖిన్నులై, నిస్తబ్ధులై, నిశ్చేష్టులై రాతిబొమ్మల వలే ఉండిపోయారు. కాని యీనాడు దేశంలో మూలమూలనా, నరనరంలో, అగ్నిలాగా ప్రచండంగా వ్యాపిస్తున్న సమిష్టి ప్రతీకార ప్రవాహంలో ఏ ద్రోహం, ఏ హింసాత్మక దృష్టాంత ప్రభవ తరంగం మాత్రమే.

హోరెస్ : నాకు తెలుసు మేయర్ !

మేయర్ : (భుజంమీద చెయ్యివేసి) హోరెస్ ! నీకు భయంగా ఉందా ?

హోరెస్ : (గద్గద స్వరంతో) లేదు మేయర్ !

విలియమ్ : గాస్టి రెడీ కర్నల్ !

మేయర్ : వెళ్ళు హోరెస్ ? మృత్యుద్వారంలో ప్రవేశించేముందు నేను నీకు చెప్ప వలచుకున్నదొకటే ! నేటినుండీ ఈ దురాక్రమణదారులు ఒక్క శాంతిశ్వాస కైనా నోచుకోరు. ఒక్క నిమిషమైనా అవకాశం లభించదు. రాత్రిం బవళ్ళు ప్రతిక్షణం ఒక భయంకరమైన అజ్ఞాతమైన సామూహికభీతి వీరి మలినహృదయాలను తపింపజేస్తుంది. వికలంజేస్తుంది. ఒక్క క్షణంకూడా యిక వీరికి విశ్రాంతి లభించదు. సెలవు హోరెస్ !

హోరెస్ : సెలవు మేయర్ !

కర్నల్ : (పెద్దగా) పిలూ సైనికులను !

# ఉబుసుపోక

— శ్రీ మంచి రామారెడ్డి

మా కథానాయకుణ్ణి పరిచయం చేయించాలంటే కొందరు రచయితలు సృష్టించే ఉంగరాల జుట్టూ, కళ్ళజోడూ, ప్లాక్‌పాలిష్ ముచ్చెల్ని ముద్దాడే మల్మలు పంచెసింగులూ, అలాంటివేవీ లేవు మా చిత్రానికి. బరిగాళ్లు, అడ్డగుడ్డ, ఖద్దరు అంటే ఖాతరు చేయనివానిలా ఓ సిల్కుషర్టూ, మొలకెత్తించిన తిరుగలిబిళ్ళలా మొహంనిండా మశూచిమచ్చలూ, దువ్వని పళ్ళను గూడా మూసిపోసే పెదవు, జుట్టూ, అతని స్కెచ్‌కి ఆధారాలు. హస్తభూషణమా అన్నట్టు పుస్తకమొకటి పట్టుకు తిరుగుతూంటాడు. మందలించేది పాపం, "నంద్యాలవారి కవిత్వం కొంత నా పైత్యం కొంత" అన్నట్టు "కలిపి కొట్టరా కావేటి రంగా" అనే ధోరణిలో ఆలపిస్తాడు తన 19 వ పురాణాన్ని. అతడు మాటాడుతూంటే మా హాస్టలులోని ఆదివారం నాటి టిఫిన్‌లా షడ్రసాలను మరిపిస్తూ, అయ్యలరాజువారి హంసవింశతిలా అతివిపుల అభిరుముఖ వర్ణనా ధూయిష్ఠమై నవరసాతీతమైన వివిధ దృశ్యమాన విషయబాహుళ్యం పుష్కరిస్తూ ఉంటుంది. శిలాంతం, జలాంతం ఛేదింపజూస్తాడు చేపట్టిన సమస్యని.

సనాతన అధునాతనుల సంవాద వివాదాల మధ్య సానలదీరిన జాతిరత్నం మారత్నం. పత్రికా పాఠకు లందరికీ అర్థమయ్యేలా ఒక్కమాటలో చెప్పాలంటే దాసువామనరావుగారి కాలక్షేపం తరువాత రత్నం లెక్చరు ఒక్కటే దక్కింది మాకు విరామకాల వినియోగానికి.

'ఏమిటిరా ఈ రగడ అంతానూ' అని ఎవడయినా అడ్డు తగిలేదే పాపం, "ఎవడి పిచ్చి వాడికి ఆనందం. నా మట్టుకు నాది రసానందం" అంటాడు.

ఇందులో నాదిగూడా ఉంది ఓటి స్వంతపిచ్చి. 'సబ్‌కా సున్‌నా అప్‌నా గానా' అనేది. అందుకని అప్పుడప్పు డతణ్ణి మాట్లాడించి ఉపయోగించుకునే వాణ్ణి.

నేను....కలమాడిస్తే ఎంత కమ్మని కవితారసం కార్పిస్తావో, ఆ ఛాయలు నీలో ఉన్నయ్, విప్లవాన్ని గ్రక్కే భావాలు నీవి అన్నాను.

అలారం కీ ఇచ్చినంత పనిజేసింది ఆమాట అతనిలో. ఏం పెద్ద పెడర్థం జేసుకొన్నాడో నా మాటని బట్టి, కొద్దిగా సైకాలజిస్టుకూడా కాబట్టి.

"ఉహూఁ కవిత్వం" అని పెదవి విరిచి "అంత నిర్వస్తువు ఇంకొకటి ఈ రోజుల్లో లేదంటే నమ్ము. మనకు సాపుకారం మొదలూ, స్వాతంత్ర్యం వరకూ, పడమటినుండి లభించినవే. ఆ మధ్య దిగుమతిమైన సరకుల్లో నేటి కవితగూడా ఒకటి.

'కాకుంటే ఏమిటి తమ్ముడూ! చూడు అంత్య ప్రాసల్తో, ఆంగ్లో ఇండియన్ సమాసాల్తో, ఆరంభించారు. ఏమిటీ ఆర్భాటం అంటే అధివాస్తవికత - అభ్యుదయం - అని నిఘంటువులు తెరిచినా దొరకనంత గొప్పగొప్ప పదాలు వాడుతారు. న్యూయార్కు గగన సౌధాల్ని వెక్కిరిస్తున్నయ్ వీరి న్యూమార్కు పోయెట్రీ వ్యగ్రభావ సౌధాలు. ఒక సాంకర్య సంస్కృతిని ప్రతిబింబింపజేసే వ్యక్తిత్వమే ప్రధాన లక్షణంగా కనిపిస్తుంది నేడు కవి అనేవాడిలో.

పుట్టు కొత్తలో పుట్టిన పుట్టగొడుగుల్లా లేచిన ఈ కవులంతా కలిసి ఎంత వరకు ప్రయత్నించారయా అంటే ఉత్త మోస్తుల విహారాగా, అబద్ధానికి పర్యాయపదంగా తయారుచేశారు కవిత్వం అనే పదాన్ని. ఇంత ఎందుకూ ఎవడైనా అసంబద్ధమూ, అసంభవమూ అయిన విషయం ఏదైనా వాగాడంటే 'ప్చ్' ఇదంతా నీ కవిత్వం తీరా-అని ఎదుటివాళ్ళనేమాటలు వినిపిస్తూనే ఉన్నాయిగా నేడూ రేపూ.

ఇదో....! కవిత్వం అనేసరికి కలిగే అభిప్రాయభేదాలు నేడు రాజకీయ కక్షల్లోకంటే గూడా కాస్త మొగ్గగానే కనిపిస్తున్నాయి. ముఖ్యంగా రెండు పార్టీ బందీలు తయారైనాయి దీనికి. సలక్షణ కవిత అంటే అభ్యుదయ కవులకీ, అభ్యుదయ కవులంటే సలక్షణ కవులకీ గిట్టదు మరి అభ్యుదయ కవితకు లక్షణం లేదో! సలక్షణ కవితలో అభ్యుదయం అనేది లేదో!

ఏమిటంటీ ఈ రాద్ధాంతం అని ఏ రాతియ్యవైనా అడిగితే "ఈ నవోత్పన్నులంతా అవ్యుత్పన్నులు, వ్యర్థులు, అసమర్థులు. ఊబిలోని రాయిమీద ఊపిరి బిగబట్టి దాటి వశీకృతి సత్వనిలా కవి మైనవాడు తాను వశం చేసుకున్న భాషాబలం ఆధారంగా యతిప్రాసలపైనుండి అతి చలాకీగా తప్పకొని భావప్రదర్శనం చేయాలి. కవికి గల భాషా ప్రమాణంయొక్క చందం కనుక్కొంటా నంటుంది ఈ గణఛందం. ఛందోనియమాల్ని సడల్చి చెంగలించే లయ నృత్యాలకంటే వచనంలో గిలుక్కోరామూ?" అంటాడు.

నీవేం చెప్తావు? అని ఇదే విషయాన్నిగూర్చి ఒక అవ్యతనుణ్ణి అడిగిచూస్తే "ఈ గత మేధావు లంతా భావాభావులు, ప్రాజ్ఞమ్మన్యులూ, ఉపజ్ఞా శూన్యులూ. కాకుంటే ఏమిటయ్యా! వీళ్ళకి మతులు పోయాయి. యతులను మాత్రం పోనీ

గంలా బర్వారా

యరు. శ్వాస విడిచేందుకు ఆసన్నమయ్యారు. ప్రాసను బట్టుకు ప్రాకులాడుతారు" అని చీదరిస్తూ—

"కవిత్వం అంటే ఉన్నది ఉన్నట్టూ, కన్నది కన్నట్టూ ప్రకటించే గవర్న్మెంటువారి గజెట్ లాంటిది కాదన్నాను ఓ పెద్దమనిషి. భావించినది భావించినట్టు బహిరంగం చేయటమే నమోను లయబద్ధపు గేయకవిత్వమూ, నానాత్వంలో ఏకత్వమూ, మా కతిత్రావ్యం, మా కతిభావ్యం. మా తాముకంతా ఒకటే పురి. మా రచనకు గూడా అదే గురి. గురుజాడ గురి - జాడ -" అంటూ ఉద్ఘాటిస్తాడు హుంవాగ్నా.

మొత్తానికేవో పొడిచేశామన్న పొగరులో "బ్రహ్మానంద సహోదరం పై ఉపనిషత్తులు వ్రాస్తాం. నిప్పునుగూడా మూట గడతాం, ఆకాశాన్నంతా అద్దంలో చూపుతాం. పరిమళాన్ని పట్టి చూపెడతాం, అంటున్నారు. వీరిలో ఒకరిది ఛాందసమైతే వేరొకరిది సాహసం.

బస్సు రాలేదా భయ్యా ! డిపోనుంచి ? అని అడిగాను హోటలుముందు ఫర్నీచరు సర్దుతూన్న ఖాజామియాని.

బస్సా ! ఏదో బాగు చేయిస్తున్నారని తెలిసింది. కొద్ది టైం బట్టొచ్చు అన్నాడతడు. సరే ! అని కుర్చీలు జరుపుకొని కూర్చున్నాం. ప్రారంభించాను రత్నం.

వర్తమానం మాతృక భవిష్యత్తుకి. పిల్లలనడపడికి పెద్దలు కారణం. "యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః, స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే" అని చెప్పుచెప్పినాడా ఆ పురాణపురుషుడు? ఎంతమంది బజారుకవులకి కులగురువు లైనారనుకున్నావు వీరు ? అభ్యుదయ కవిత అంటే ఏముంది? అడ్డగోలు జమాబందీ అన్నట్టు రాస్తున్నారు. అంతా తాత్కాలికోద్రేకజనిత వ్యగ్రోదంతాలూ, అభావధ్వాంతాలూ అయిన తాటాకుమంటలూ వీరిరచనలు. మరి వీరినంతా అభ్యుదయ కవులే అనాలో, ఆంధ్రసాహిత్యానికి తెవులే అనాలో !

ఇంకొక తమాషా. 'రియలిజం' రాసక్రీడల్లో 'రిమెలిక్స్' ప్రాసక్రీడల్లో గంతులేస్తూకూడా 'ఇది అధివాస్తవికత కాదు. అది ఫ్రాన్సుఫ్యాషన్‌లాగ పుట్టింది, గిట్టింది.' అని చెప్పుకుంటున్నారు. కాని అభ్యుదయ శబ్దానికి నిర్వచనమీయడంలో మాత్రం తప్పుకుంటున్నారు.

'గజిబిజి సీటున గూర్చొని
కాలూపు అకర్మణ్యులు
పూర్వజన్మ కృతపుణ్యు

బకిద్మత్ గిరామీ అంటే
మాదర్‌చోద్ హరామీ అంటారు.
కళ్ళుండీ కననేరరు, చెవులుండీ విననేరరు.
కళ్ళ గనక, చెవుల వినక, కసరు గ్రక్కు ఈ మొహాలు
పాతరాతి యుగమునాటి పాషాణపు విగ్రహాలు.'

అనీ ఇలాంటి పోకడలో పద్దాడనుకోండి ఒకడు. వాడు వెంటనే ఈ అభ్యుదయ యుగాన్ని అంతమొందించి పరలోక విప్లవయుగాన్ని స్థాపించిన వీరవర్ధమాన కవి చక్రవర్తి అయిపోతాడు. ఆ గేయం రచనారంగంలో మన్మథసంవత్సరాన్నే మథించి పిండిన అమృతధార.

"ఏమిటి రత్నంబాబా, నీ వెట్టిమత సిద్ధాంతం? దేవుడు లేడనేవానిముందు ఉన్నాడని తర్కిస్తావు. ఉన్నాడని ఒక్కడననీ ఆధారాలుచూపమని వాని వెంటబడు తావు. కాంగ్రెసు కార్యకర్తల్లో కమ్యూనిష్టు సిద్ధాంతాల్తో కొట్లాడుతావు. సామ్యవాదు లకు గాంధీజం నెమ్మదిగా ఉపదేశిస్తావుంటావు. కవులను విమర్శిస్తావు. విమర్శకు లపై వికటకవిత్వాలు కడతావు. నీ మాటల్లో అయింతా చిత్తస్థైర్యాన్ని కోల్పోవల సిందే." అని చిరాకెత్తిన మొహంతో మా హేమాద్రి ఎదురు తిరిగాడు.

రత్నం: ఇగనోయ్ నా మాటలకి విలువ తర్వాత కడుదువు అటుంచు. నాదేం మ్యాజ్జిమం క్వాలిఫికేషన్ కాదు. ఎంతైనా చెంబులో ఉంచే నీళ్ళా సెంకులో పోస్తే తీర్థం. సరే నీమాటకే వస్తాం. అయినపిల్లా కాదనే స్వభావం ఓటి నాకున్నదని గమా నీవంటగడుతున్నావు. అందులోనే ఉంది గమ్మత్తు. ఒక వస్తువుయొక్క అస్తిత్వం, నిజానిజాలు నిర్ణయించుకొనే శక్తిని ఆశించేవానికల్లా అది అవసరం. అది జిగీషువుగామారే జిజ్ఞాసువుయొక్క లక్షణం. తెలిసిందా! అదే నాతత్వం అర్థమయిందా? అని ఫస్టు ఇంప్రెషన్ వేసుకునే కొత్త ఆఫీసరంత ఘనగర్జనం వెలిబుచ్చాడు.

నీవు నమ్మా నమ్మకపో. కాన్పులూ, కవిత్వాలు, ఈ రెండువిధులనే బాగా గుర్తెరిగి నెరవేరుస్తున్నారు భారతీయులు. కాస్తోకూస్తో భాషావిషయంలో పరిశ్రమ చేయబూనుకొన్న వానినుంచి 'రామునితోకా పివరుండిట్లనియె' అనే రాయళ్ళవరకూ కాయితాలేవో నల్లగజేసి ఇదిగో కవిత్వం అంటున్నారు. అది ఏ పిట్టతోకో తెలియని పిల్లకుంకలు వీళ్లు. కవిత్వం అగ్గువయింది, కాయితాలను తీవ్రం చేసింది.

అబ్బా! అబ్బా! ఎంతమంది బయలుదేరారు వీళ్ళు. మరీ చదువరులైన [illegible]గుర్లో అపముప్పాతికభాగం కవిత్వాలు రాసే సోమరిపోతులు. వీరు రాసే [illegible]గంలా బర్బరాలు.

పద్యాల్లో M. L. A ల స్వాగతాలూ, మంత్రుల సన్మానాలూ, 15 ఆగష్టు ప్రగల్భాలూ, పంచవర్ష ప్రణాళికలపై పంతాలూ, 30 జనవరి తాత తద్దినపు అశ్రుతర్పణాలూ, ఎగైరా ఎగైరాల కిందికి ముప్పాతిక మున్వీసాలు వసూలు అయితాయి.

నా ముందరికి వచ్చిన విషయమొకటి చెప్తాను. నాతో పనిగలిగి వచ్చిన వ్యక్తి ఒకడు తోకవెంట పెయ్యిమాళ్ళలా తోలుకవచ్చిన శిష్యుని చూపి మావాడు మంచి కవిత్వం రాస్తాడండి ... చదువురా పేరు వింటారు, అనడంతో ఆరంభించాడా పిల్లాడు.

"వాణీ గీర్వాణీ యనుమనే పలుకుచుండ
మాయిబల్కా ఎదేంనే మగువ! నీవు."
"మాయిబల్కా ఎదేంనే!" ఏదీ మళ్లీ అనూ అన్నా.
"మాయి బల్కావదేంనే మగువ! నీవు"

హఠాత్సంభవమైన కోపాన్ని ఆపుకోలేకపోయాను 'వాణిని రాణినిచేసుకొన్న చిన్నిపద్మసంభవుని పేరు నిలబెట్టిన పిల్లపద్మసంభవుడవారా నీవా? మగువ నీవు అట మగువ నీవు. 'మాత నీవు?' అనలేకపోయావట్రా? అని గద్దించా........ .......
అంటూ అక్కడ ఆగిపోయాడు సత్యం. అతనినోట మాట రాలడంలేదు. నేనూ ఇటునటు తిరిగి చూస్తున్నాను .. మా కాఫీ కప్పులు ముందరికి దిగినయ్ పంచదార వేస్తూ కనుకనుక కలిపివేస్తున్నాడో ఆసామీ.

వచ్చుచున్నది. అని పెద్దపెద్ద అక్షరాల్లో రాసి ఆ అడ్డగోడకి అంటించిన (చంద్రహారం) ప్రచార పటంలో చాకులగాళ్ళతో వయ్యారంగా వారిగిన సావిత్రి మూతిమీద అంతసేపూ మనసాయి దృష్టిమాసే ఉన్నాడా హోటలు కుర్రాడు ఎప్పుడు వెళ్ళాడో! ఎప్పుడు తెచ్చాడో!

"ఆర్డ రెవరిచ్చారు?" అన్నాడు మా హేమాద్రి. ఆర్డర్ ఈజ్ ఆర్డర్ అనే ఆఫీసు కాదండీ యిది. మా గుమ్మం తొక్కిన వాళ్ళకి మర్యాదచేయడం మా విధి. అడగాలా మీలాంటి పెద్దమొహాలు? అన్నాడా కుర్రాడు. ఈ బలవద్బంధు సత్కారాన్ని స్వీకరించక తప్పిందికాదు. ఆ కాస్తా చేతులు దులుపుకొని మూతులు తుడుచుకొంటూ ఆవలపడ్డాం....................................

స్టేజీ కందాన్ని చేరుకున్నాం. దుమ్ము దూరంగా ఉంది. సిమెంటు వేదికమీద సీటువేశాడు సత్యం. మేమూ అంగరక్షకుల్లా అతని కిరుప్రక్కలా ఆసీనులమయ్యాం.

గొంగడి మడతలపై నెట్టుగా కూర్చొని పొగచుట్టలు పీల్చేవాళ్ళూ, పట్లాం జేబుల్లో చేతులిరికించి పచారుచేసే కళ్ళజోళ్ళవాళ్ళు, పేలుకుక్కుకుంటూ సీత్కారాలతో కూర్చున్న పల్లెటూరు స్త్రీయా, ఇంకా ఇంకా గలభా ఉంది అట.

“ఇక తరుచూ కనిపించేది కథాసాహిత్యం, అంటూ ఉపక్రమించాడు మళ్ళీ మా రత్నం. ఊఁ అని ఊకొడుతూ వినడానికి చెవులు వాలేస్తున్నాను నేను. విసుగుతూ, నుసులుతూ, ఆవలిస్తూ చిటుకలేస్తున్నాడు మా హేమాద్రి.

‘దీనికి వెనుకాలా చరిత్ర చాలా ఉంది. అయినా మూడు మాటల్లో ముచ్చట ముగిద్దాం. నేటి ఆర్థిక సమస్యల్తో సతమత మౌతూండే ప్రజకి దీర్ఘ కావ్యాలు చదువుకొనే తీరిక ఎక్కడా ? సూక్ష్మంలో మోక్షం అన్నట్టు ఆనందమూ, ఉపయోగమూ, అనే కావ్యప్రయోజనాల్ని కొద్దికాలంలో అంటే గంట బస్సుప్రయాణంలో గ్రహించడానికి కనుగొనబడ్డాయి ఈ కథానికలు. మరి ఇవి ఎలాతయారైనై ? ఏం నేర్పుతున్నై ? అని ప్రశ్నించుకొని, అమ్మాయిల ఆరంభయౌవనంలో అగుపించే అంగసౌష్ఠవాలకీ, ఎఱ్ఱని పైతోళ్ళకీ, ఆస పెట్టించి అమాయికులైన యువకుల్ని అసభ్యమైన ప్రాణత్యాగం చేయించేవాటిని మినహాయిస్తే... ఇక ఒక కథ మనవృక్కుల్ని శూన్యంలోకి జొనిపించి ముగుస్తుంది. ఇంకొకటి నిట్టూర్పు విడిపిస్తుంది. వేరొకటి అనాథలకి బ్రతికే హక్కే లేదని నిక్కచ్చిగా నిరూపించి నిష్క్రమిస్తుంది.

ఇలాంటి కథల ప్రభావంవల్ల సమాజంలో కిం కర్తవ్యమనే కిటుకు తేలక మధ్యతరగతి కుటుంబాలకేమి ? కాటకపాటక జనానికేమి ? బహుళ ప్రజకి అనంది నిత్యజీవితంలో ఇంతవరకూ అనుభవించిన ఈతిబాధలే మననం కలిగి, ఎదురుకు వచ్చి హృదయాగ్నిలో చిచ్చు రగిల్చి, అంతకుపూర్వమే ఆకలిత్రేపులను అంటుకున్న క్షుధాగ్నితో ఏకమై ఆశాపూరితమైన వారి భావిజీవితాన్ని భస్మీపటలం చేస్తుంటే చూస్తూ చూస్తూ ఈ ప్రపంచాగ్నిలో సమిధల్ని ఆహుతిచ్చి మారణహోమ మంత్రాల్ని పఠించడంలో ఫలితం పరిణామం ఏమిటి ? ఇక తద్భ్రాంతికై ఇటు ఇటు అని స్వాగతమిచ్చేది హింసా మహాసముద్ర మొకటేగా మిగిలింది !

ఎక్కడో చదివినట్టు జ్ఞాపకం. “సాహిత్యం వలన మనమాశించేది ఆత్మానందం మాత్రమే గాదు. కనీసం వ్యక్తిలో ఆత్మవికాసం కలుగజేయవలసిన ధర్మం దానిది.” ఇదే నిజమైనపుడు పైరకం సాహిత్యం ఆత్మ వికాసానికా ? ఆత్మ నాశానికా ?

ఆం.

గంలా బరంరాం.

ఇలా కొంపముంచాల్సే క్షేమమయ సాహితీసృష్టి మనమూ చేయాల్సింది ? కుడిచి కూర్చొని కుర్చీల్లో కూనిరాగాలు తీసే రక్తపిపాసువులైన సామ్రాజ్యవాద వారసులు చేస్తారు.

మాటల బహాటానో ముంచాను. 'విటకానితో లేచిపోయిన నీ విశాలాక్షి ఏం నేర్పింది సంఘానికి' అని ఆనాటి కథానికను గురించి అడిగాను ఆ రచయితను.

"ఊఁ కట్టమించి అంత వాదే అన్నాడు కవితకూ నీతికీ పొత్తేమిటీ" అని. మొన్నమొన్న ఏవో ఆ పత్రికల్లోవీ ఈ సభల్లోవీ నేర్చుకొచ్చావ్ నాలుగు మాటలు అని ఒక బలమైన ఆధారంతో నొక్కివూయిస్తూ పైగా సాహిత్యాన్ని గురించి నీకు చాలా తక్కువ తెలుసు అన్నాడు.

నిజానికి కర్తవ్యాన్ని గురించి బోధించే సాహిత్య మెంత వచ్చింది మనకి ? ఎందరినో అడిగా నీమాట. ఏదో ఉన్నట్టూ, జ్ఞాపకం లేనట్టూ బుర్ర గోక్కుంటారు. అంటే వ్యంగ్యమనేగా అర్థం ? కీర్తి కండూతితో నీకుగూడా ఈ చెత్తరకపు రచయితల్లో చేరిపోవడానికి కలిగిన ఉబలాటాన్ని చూస్తే నవ్వువస్తుంది నాకు.

నేను : అప్పుడు 'విమర్శనా రంగంలో విహరించేవాడే సాహిత్యాన్ని సజీవంగా ఉంచుతాడు. మైనారిటీలో చేరినవాడే నిజమైన చిత్తశుద్ధితో దేశసేవ చేయగలుగుతాడు' అంటారు అనుభవజ్ఞులు. నీలాంటి వాళ్లు ఏదో ప్రయత్నం చేసి నేటి రచనల్లోని బాగోగుల్ని విచారించి బహిరంగంచేయడమే బాగనిపిస్తుంది. సాక్షి తర్వాత విమర్శనా యుగాన్ని స్థాపించిన పుణ్యం దక్కుతుంది.

రత్నం : అబ్బో ! అంతగా ప్రపంచాన్ని స్టడీచేసిన ఆయనెక్కడ ? సరిగ్గా తెలుగుపదాలు అనేవి ఏవో అవి ఎన్నో తెలియని నేనెక్కడ ?....నక్క యెక్కడా! నాకలోక మెక్కడా ! ..నిజంగా ఒక్కపానుగంటి పదిమంది కవులకంటె ఎక్కుడుగా కర్తవ్యాన్ని, ప్రయోజనాన్ని గాలించ గలిగాడు. 'సాహిత్యం దర్శన మూర్ధన్య' మన్న మాటకి నిదర్శనమైన రాత ఆయనది. అతడే వుంటే వీళ్ళ అధివాస్తవికత లోని అతివాస్తవికతను ఎరిగేవాళ్ళం. (కొంతసేపు ఆగి)....ఓ రాజకీయవేత్త యేమన్నాడో తెలుసా ? "ఆకలిప్రజ అరిచే అరుపుల్ని అట్టే వ్రాయరాదు సంపాదకుడు. వారికి ఏంకావాలో అది ఎలా లభిస్తుందో రాయాలి." ఈ ఉద్బోధం అక్షరాలా రచయితలకిగూడా అనువర్తిస్తుంది నేటికి.

నేను : ఓహో చాలా గడ్డు ఉద్దేశాన్నే ఆశిస్తున్నావు రచనల వెనుక. అలానే కావాలంటే, వీళ్ళల్లో 99% మంది కలాలను జారవిడిచి విషాదయోగంలోని విగత గాండీవికి పోలికగా ఉండిపోతారు.

రత్నం : అలా కానినాడు ఎలా సామాన్యునికి తేడాగా ఉంటాడు రచయిత అనేవాడు ? సరే అది ఉండనీ.

మాది అని చెప్పకొనే స్వతంత్ర రచనగూడా చాలాచాలా తక్కువ ఆంధ్రులకి. చూస్తున్నాముగా అటు ఆంగ్ల ప్రపంచానికీ, ఇటు హిందీ వోవళ్లకీ, తప్పితే శరత్సాహిత్యానికీ, ప్రాకులాడే డైరెక్టర్లని. వాళ్ళు సైతం తిడుతూనే ఉన్నారాయె. మన వాళ్లలో ఉపజ్ఞాబలమూ, సృష్ట్యాత్మక కల్పనా లోపించిందని. ఎక్కడలేకుంటే అక్కడెుగుడే అన్నట్టూ నవలా, నాటక రూపాల్లో అవతరించే అనువాద సాహిత్యమూ, ఆంగ్లానుకరణమూ, అవశ్యానుసరణీయంబులు అయినాయి మనకి.

వేరొకగొంతు : "అవునండీ. శ్వేతకుష్టులా ఆ ఆంగ్లత్వం వదలలేదు. ఇంకా వాట్ హూట్ అనేవాడే సభాపూజ్యుడు. 'పంచదార' అంటే ఐదు రంగులదారం అని అర్థంజెప్పే పట్టభద్రునకుండే గౌరవం పంచకావ్యాలు చదువుకున్న వాడికి లేదు. ఏం గౌరవమండీ ఇలాంటి వాళ్ళ గౌరవం ? అది మనం ఇస్తూంటే అలా ఉంటూ ఉంటుంది." అని అడ్డువాదనకు దాపరించా డొక తెలుగుపండితుడు.

భాష వైశిష్ట్యాన్ని ఆకాంక్షించి చర్చించుకొనే మా మాటలమధ్యకు విఘ్నేశ్వరునికి వియ్యంకునిలా అడ్డు తగిలిన అతనిమొహం తట్టు చూచేసరికి ముక్కుమీదికి వచ్చింది కోపం మా రత్నానికి. "కనిపెట్టరాదుటండీ జట్ప్లేన్‌ను పైడివ్వ మనే పుష్పకాన్నొకదాన్ని ? ఉన్నాయిగా మీ వేదాలూ?" అన్నాడు.

తె. పం : అయ్యో ! వేదాల పుణ్యం కాకుంటే అతగాళ్ళకెక్కడిదండీ ఈ యంత్ర విజ్ఞానం ? అథర్వణాన్ని అనువదించిన ఫలితాలే యివి.

రత్నం : అనువాద ఫలితంగా అతడిల్లా పంచభూతాల్ని వశంచేసుకొని ప్రకృతిని ఆడిస్తున్నాడంటే, అసలు కాపీలు ఉంచుకొని మీరేం నరకుతున్నారండీ ఆర్యమానసపుత్రులు ?

తె. పం : అథర్వణాన్ని అధిక భాగం అపహరించారండీ !

రత్నం : దొంగలు — దొబ్బలేక దొంగలు! నిద్రమబ్బు మొహాలు మనవి. మొదటినుండీ ఇంతే చెబుతున్నాయి మన పురాణాలు. మన వేదాలకి దొంగలు మనకి అవతారాలు.

ఆరన్‌తో అరుస్తూ అడుగడుగున అవనీరజాన్ని ఆవిర్భవింపజేస్తూ లోహాగ్రంలా బర్బరారావంతో బయలును ధ్వనింపజేసే బస్సుచప్పుడు హఠాత్తుగా

అందరి శ్రద్ధనూ ఆకర్షించి మాతలల్ని గూడా మలుపుకుంది తనవైపు. అలానే వచ్చి స్టేజీకంటానికి ఒక్క ప్రదక్షిణం చేసికొని అది వెళ్లే లైనుకు అభిముఖమై ఆగింది. 'నవాపేట్' అని వినిపిస్తుంది కండక్టరు కంఠధ్వని. టికిట్సు పంచ్ బెల్ టింగ్ టింగుల మధ్య ప్రయాణీకుల్తోపాటు భర్తీ అయ్యాడు రత్నం. బర్రున బస్సు కదిలింది. మా హేమాద్రికి నెత్తినొప్పి వదిలింది ★

*కవిత :*

# తారకము

— శ్రీ సదాశివ

అమృతపు జల్లుతో నెవని హస్తము నన్ను స్పృశించి చేసె? గౌ
తమముని పూర్ణకోప జనితంబగు శాపపు టంధకారమే
ద్యుమణి శుభాగమమ్మున విఘాతితమయ్యెను! శుష్కమైన యా
శ్రమమున నా ముని ప్రభ విరాజితె గన్నుల విందొనర్చుచున్.

శిలనై యుండిన నాశరీరమును కించిత్స్పర్శచే సర్వ శ
క్తుల చైతన్యము గల్గ జేసిన శుభాంగుం డెవ్వడో? తత్పదం
బులచే రేచిన ధూళి సోకినది గాబోలున్ మదీయాఘ పం
కిల మెల్లన్ విడిపోయె; దిక్తటుల బ్రాకెన్ ధన్యవాదార్భటుల్.

లలితత రేంద్ర నీలప్రభన్ జగదేక
మోహనంబగు దివ్యమూర్తితోడ
వాడిన దుఃఖిత ప్రజ పెదవులకు జి
ర్ణగపు నేర్పెడు స్మితాననముతోడ
అమిత గభీర దయాసముద్రము లన
దనరారు నార్ద్ర నేత్రముల తోడ
నిగ్రహానుగ్రహ నిపుణత మెఱయ న
స్త్రము, బద్మముగల హస్తముల తోడ

నెవ్వరో నన్ను దిలకింతు రెవ్వరన్న !
ఎవ్వతెను నేను నన్ను నీవెఱిగెదవె ? మ
నిద్దఱకు నెట్టి సంబంధమేని కలదె ?
రామమూర్తివె సుగుణాభిరామ ! నీవు.

ఎన్నో యేడుల కీవు వచ్చితివి తండ్రీ ! నన్ను రక్షింపగా
గన్నీరై ప్రవహించె డెంద మయినన్ గాయంబు గాలాన సం
ఛన్నమ్మై నశియించిపోక, చిర పశ్చాత్తాప దగ్ధంబునై
మన్నై పోవర నిల్చె శాపమున నీ మాడ్కిన్ శిలారూపమై.

నీకొఱ కిన్నినాళు లిట నిల్చితి నిట్లు శిలాకృతిన్, మహా
త్మా ! కడు చిత్రమైనది యుదంత మిదంతయు; విన్నవారు గా
నీ, కరుణావ లోకనము నిల్పి గ్రహింపగ జూచువారు గా
నీ కలరే త్రిలోకముల నీవొకరుండవు గాక రాఘవా !

హృదయమునందు గుప్తముగ నిన్ని దినంబులు దాచి యుంచినన్
సదమలరూప ! నిబ్బరము చక్కగ గగ్గెను గాని నేడు నీ
పదములు సోక జీవములు వచ్చెవి గావున దాగజాల వి
య్యెదె భవదంఘ్రి సన్నిధిని నాత్మ నివేదన మాచరించెదన్.

సురపతి చెట్ట చూ పొలయ జూచెను; నాపతి యాగ్రహించి, యి
క్కరణి శపించె; నంత ద్రిజగమ్మును నా యపకీర్తి గాథలన్
దిరముగ సంతరించుకొని తిట్టెను - నీపదయుగ్మ మిప్పు డా
దరమున నుద్ధరించె; భవతారక ! నీకు నమస్కరించెదన్.

ఆదియు నంతమే తెలియనట్టిది కాలము; దాని గర్భ మం
దేదెస లీనమయ్యెనొ మదీయ మనోవ్యథ లైన నిప్డు నా
పేద యెడంద విట్టు విలపించిన దెల్ల ప్రతిధ్వనించు న
య్యో ! దినరాజవంశ తిలకా ! యిట గల్గు మహీధరమ్ములన్.

ఆ గోదావరి నస్మ దశ్రుజల కుల్యల్ సంగమించెన్: మహా
భాగా! నీకు తరంగ ఘోష వినిపింపం జాలు నాగాథ ల
మ్మా! గోదావరి! నీవె సాక్షి విక గోప్యంబేల? నీగర్భమం
దే గుప్తమ్మగు నా మనోవ్యథ నివేదింపంగదే స్వామికిన్.

అందఱు తెల్పుచుండి రదె అల్లదె, చూచితె? వింటె? చాలదే?
ఎందుల కిన్ని సాక్ష్యములు నీవు గ్రహింపగలేవె? నేనె పో
మందమతిన్ - నిను న్మనుజమాత్రునిగా గణియింతునేమొ! నీ
ముందఱ ప్రజ్ఞలా? పరిమ ముగ్ధను నన్ను క్షమింపుమా ప్రభూ!

కల్మషార్ణవంబున బడి క్రందు ప్రాణి
తెలిసి నిన్ను పశ్చాత్తాప కలన గొలువ
జేయు కొందువు నీలోన జిత్తగించి;
తారకము భవన్నామ సంస్తవము దేవ?



వ్యాసము :

# మార్కండేయ పురాణములు - మనుచరిత్రము

— శ్రీ పల్లా దుర్గయ్య, ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## స్వారోచిష జననానంతర కథా భాగము

### హంస మిథున సంవాదము :

ఈ షష్ఠాశ్వాసమునందు సంస్కృతాంధ్ర పురాణములందు మూడు సంవాదములు కలవు. 1. కలహంసీ చక్రవాకాంగనా సంవాదము 2. మృగదంపతుల సంవాదము 3. హంస మిథున సంవాదము. మొదటి రెండు స్వారోచికి ముగ్గురు భార్యలనుండి పుత్రులు పుట్టుటకు ప్రాశస్త్యమును, చివరిదగు మూడవ సంవాదము వనదేవతయందు స్వారోచిష ముదయించిన పిమ్మటను గలవు. మూడవ సంవాద సారాంశ మిది. 'భోగైక సక్తులు సంతత సంగపరులు నగు వారిమతి పరమార్థ దర్శిని ముక్తికి గాజాలదు. వారి భర్తృ బంధు పుత్ర మిత్ర కళత్రములందు సక్తులై బహుళపంక పతిత వనగజంబు వలె కదల నేరక పొలియుదురు. సంగపరిత చిత్తుడును నంగనా రాగాంధుడైన యీ స్వారోచిని జూడుము. పుత్ర పౌత్ర వృద్ధిని బొంది నీతడు విషయోపభోగనిరతి నున్నవాడు. నేను వివేకమునంజేసి భోగములు పరిహరించితిని. కామినీ పరతంత్రుడైన యీ స్వారోచి నాకు సదృశుడు కాడు. మనము కడు ముదిసితిమి కాన నిహభోగము లింక నుడుగ బొప్పు' నని హంస హంసితో వాదించినట్లు ఈ వాక్యములు విని 'స్వారోచి జాతోద్వేగుండై భార్యా సహితంబు వనంబునకుం జని ఘోర తపం బొనరించి నిష్కల్మషత్వంబు నొంది యుత్తమలోకమున కరిగె' ననియు, నంత

'మనువుంగా స్వారోచిషు, వనరుహ గర్భుం డొనర్చె వరగుణ! వినుమ
మ్మను కాలంబున బరగిన యనిమిషులను మునుల నింద్రు నవనీశ్వరులన్'

అనినట్లు మనుకాలము నందలి దేవతాదులను దెలిపి యనంతర పరిపాలకులగు మనుపుత్రులు రాజులై ధర పాలించిరని ముగించి ఫలశ్రుతి చెప్పబడినది.

మూలములోని మొదటి రెండు సంవాదములను పెద్దన మనుచరిత్రమునందు యథా తథముగా వ్రాసెను. కాని మూడవదగు హంస హంసీ సంవాదమును పూర్తిగ వదలివేసెను. దీనితోబాటీవాద ఫలితముగా జనించిన స్వరోచి వైరాగ్యమును, వైరాగ్య సంజనితమగు నతని తపస్సును, తత్ఫలితమగు నతని యుత్తమలోక ప్రాప్తియునను విషయములు గూడ మను చరిత్రమునందు విడిచివేయ బడెను. స్వారోచిషు జననము తోడనే పెద్దన స్వరోచి వృత్తాంత మును ముగించి దానికి బదులుగా స్వారోచిషమను వృత్తాంతమును బెంచి వర్ణించెను. ఈ సందర్భమున మూల కథలలో హంస హంసీ వాదమును విని వైరాగ్యము జనించి తప స్సొనరించి స్వరోచి యుత్తమ లోకమున కేగెననియు, దదనంతరము బ్రహ్మ స్వారోచిషుని

మనువుగా జేసెననియు నుండగా మను చరిత్రమున బెద్దన పుత్రజననముతో స్వరోచి వృత్తాంతమును ముగించి, మనువు గాదగిన స్వారోచిషుడే శాంతి దాంతి దయా సత్య నిరతుడై విష్ణుమూర్తిని గూర్చి తపమాచరించి నట్లును, దానికి మెచ్చి సకల బృందారక గణముతో లక్ష్మీశ్వరుడు ప్రత్యక్షమయ్యెననియు చెప్పి, యిట్లు సాక్షాత్కరించిన హరిని స్వారోచిషుడు దశావతార స్తోత్ర మొనరించి ప్రసన్నుని గావించి, 'దేవ భవద్దాస్య సుఖంబే వేడెద' నని ప్రార్థింపగా

'స్వారోచిషుఁ డని నిచ్చలు, నేలు మహిం ద్వితీయ మనువై నయ ధ
ర్మాలోలం బుద్ధి చిరముగ వేలుపులకు దపసులకును విధికి ప్రియముగాన్'
అని మహిమన్ మనుత్వమున కాతని బట్టముగట్టి పద్మలో
చనుఁడు చరించె శిష్టముఖ సర్వ సురవ్రజంతో నదృశ్యుఁడై
చనియె నిజాలయంబునకు, శాస్త్ర వినిర్ణయ యుక్తి నంత నా
తనియును నర్థిఁ బెంచు ప్రజలం బ్రజలుల్లసిలెం గృపామతిన్.
అని యిట్లు విష్ణువు స్వారోచిషుని మనుత్వమునకు బట్టము గట్టి పోయినట్లు వర్ణించి పిమ్మట మూలములో వలెనే

'కోరికె నీ స్వారోచిష చారిత్రము వినిన వ్రాయ జదివిన ధన ధా
న్యారోగ్య పుత్రవంతులనై రూఢిగ గల్గుదు రిహపర సమంతత్వంబున్'
అను ఫలశ్రుతి పద్యములో మనుచరిత్ర మహా ప్రబంధమును పూర్తిచేసెను.

స్వరోచి తపమును స్వారోచిష తపముగా బెద్దన మార్చుటయే యిట ముఖ్యమైనది. ఈమార్పు ననుసరించియే తక్కిన కల్పనలు ఈ ఘట్టమున చేయబడినవి. కావున నీమార్పు కారణమును నిందలి యౌచిత్యమును తెలిసికొన్న తక్కినవి సులభముగా బోధపడును. కావున దీనిని ముందుగా విచారింతము.

మనుచరిత్ర కాధారమైన మార్కండేయ పురాణమున నిట్లు కలదు.
మన్వంతరం మయాఖ్యాతం మునే స్వాయంభువం చ యత్
స్వారోచిషాఖ్య మన్వంత్రం శృణు తస్మా దనంతరమ్.
స్వాయంభువ మన్వంతరము చెప్పితిని. ఇక రెండవదగు స్వారోచిష మన్వంతరమును వినుము. అని చెప్పి ప్రవరుని కథతో ప్రారంభింప బడినది. అనియిట్లు స్వారోచిష మన్వంతరమును గూర్చిన యందు స్వారోచిషుని కథ మిగుల క్లుప్తముగా గలదు. స్వరోచికి వనదేవత యందు స్వారోచిషుడు జనించెననియు, నతనిని బ్రహ్మ మనువుగా జేసెననియు, నతని రాజ్యకాలమున నీయీ దేవతలు, ఋషులు కలరనియు, తదనంతర మతని పుత్రులు రాజ్యమొనరించిరనియు మాత్రము చెప్పి ముగింప బడినది. ఈమను వృత్తాంతమునందు విశేషముగా స్వరోచి వృత్తాంతమును తజ్జనన హేతువగు వరూధినీ ప్రవర వృత్తాంతమే యుండుట వలన మూలమున ఫలశ్రుతి యిట్లు చెప్పబడినది.

"స్వారోచిషస్తు చరితం జన్మ స్వారో
చిషస్య ముచ్యతే పాపై శ్శ్రద్ధధానో హి మానవః"

స్వరోచి చరితమును, మఱియు స్వారోచిషుని జన్మమును శ్రద్ధతో వినిన మానవుఁడు పాపములనుండి విముక్తుఁడగునని చెప్పఁబడినది. తెలుఁగు పురాణమునందు 'స్వరోచి జన్మంబును, వర్తనంబున్, స్వారోచిషాద్వి ప్రభవంబు విన్నన్' అని యుండుట వివరించి స్వరోచి జన్మంబనుటచే వరూధినీ ప్రవర వృత్తాంతంబును, స్వరోచి వర్తనంబనుటచే మనోరమాదుల వివాహమును, స్వారోచిషాద్వి ప్రభవమనుటచే వనదేవతయందు స్వారోచిషుని పుట్టుకయు కలవని మాఁకు తెలిపినవాఁడాయెను. పెద్దన తన గ్రంథమునకు 'స్వారోచిష మనుసంభవ' మనియు 'మనుచరిత్ర' మనియు పేరుపెట్టి, దాని ననుసరించి ఫలశ్రుతియందును పైనఁదెలిపి నట్లు 'కోరి నీ స్వారోచిషు చారిత్రము వినిన వ్రాయ జదివిన' అని తాను గ్రంథమునకుఁ బెట్టిన పేరును సమర్థించుకొనుటకో యనునట్లు 'స్వారోచిషు చారిత్ర'ము విన్న పుణ్యము గలుగునని చెప్పెను. గ్రంథమునకు పెద్దన పురాణమునందలి నామమునే పెట్టెను. ఐనను 'మనుచరిత్రము' 'స్వారోచిష మనుసంభవ' మను నీ నామకరణము పెద్దనకే సంతృప్తి కరముగా నున్నట్లగుపించదు. కాని స్వరోచి వృత్తాంతమే యందధికముగ నుండుటచే దీనిని స్వరోచి చరిత్రమని చెప్పినఁ బ్రయోజనములేదు. ముఖ్యమైనది ద్వితీయ మనుచరిత్రమే. మూలమునందు స్వారోచిషుని వృత్తాంత మతిస్వల్పము. మూలమునందులేని కథాకల్పనము, అదియును మనుసంభవ విషయమున నధికముగా జేయుటతగదు. కాబట్టి యున్నకథనే మూలావిరుద్ధముగ, నౌచిత్యము చెడకుండ గొంతపెంచి వ్రాయవలసివచ్చెను. స్వారోచిషుని జన్మవృత్తాంతమే యిందలి స్వరోచి కథయొక్క ముఖ్యోద్దేశము కాబట్టి యతని కథను పెద్దన వదలివేసి, స్వారోచిషు వృత్తాంతమునుపెంచి చెప్పుటవసరము కావునను, వేఱుచోట నితని వృత్తాంతమును పెంచుటకు మూలమున నెట్టి యాధారములుగాని, సూచనలుగాని లేకపోవుట వలనను, మూలమునందుగల స్వరోచి తపోవృత్తాంతమును వదలివేసి, మూలమునందులేని స్వారోచిషుతపము, విష్ణుసాక్షాత్కారము, దశావతార స్తోత్రము మొదలగు పుణ్యవృత్తాంతమును పెంచి వ్రాసెను. స్వరోచి తపోవృత్తాంతము విడుచుటవలన మునిగిపోయిన దేమియులేదు. ఏలన పుత్రజననానంతరమున రాజులందరును రాజ్యభారమునుత్యజించి కాననముల దపమాచరించుట పురాణకాల రాజ వంశాచారము. కావున నది చెప్పఁబడకున్నను సూహ్యమై యున్నది. ఈ కారణమున స్వరోచితపమును పెద్దన వర్ణింపక వదలెను. మూలమందలి దాని నేలవదలెనన్న, దానెట్లును స్వారోచిషుని తపోవృత్తాంతమును వ్రాయఁ దలపెట్టి యుండుట నొకేచోట రెండు తపోవర్ణనలు పునరుక్తులై కావ్య రామణీయకమును జెఱచి పాఠకులకు రుచిభంగము కలిగించును.

మూలములోని స్వరోచి తపస్సు నట్లేయుంచి స్వారోచిషుని తపోవృత్తాంతమునుఁ గ్రొత్తగా జేర్చికుండిన నష్టమేమి ? యను ప్రశ్న రావచ్చును. ఇట్లు చేయకుండిన నిజముగా గొంత నష్టమే యని యూహింపవచ్చును. స్వరోచి సుతుఁడగు స్వారోచిషుడు మను వెట్లుకాగలిగెను? అతని కాయోగ్యత యెట్లు కలిగినది? అను విషయమును సంశయాస్పదములుగ నుండెడివికాదా ! స్వరోచి పుత్రుడు మనువు కాగలడని శంభురాణి కళావతికి, మఱియు వనదేవత [illegible]చికినిఁ దెల్పియేయుండినను, తన భోగలాలసత్వము దాంపత్యనిష్ఠమై ధర్మసమ్మతమే

యయ్యెను. మితిమీఱుటచే రాజహంసీ చక్రవాకాంగనల చేతను మృగీబృంద పరివృత మృగశ్రేష్ఠముచేతను గర్హింపఁబడినను, దానిని విడువలేని చంచలచిత్తుడగు స్వారోచికిని దేవతల కోరికచే వనదేవతయందు ఉద్భవించిన స్వారోచి యపత్యమగుట రాజ్యపాలన యోగ్యతయు వనదేవతా గర్భసంభవు డగుట శాంతి దాంతి దయా సత్యాది ధర్మగుణస్వభావుడు నగుట మనువై పట్టాభిషేకార్హతయు గలిగి తపోవిధానముచే నా యోగ్యత మఱియు హెచ్చి విష్ణు ప్రసాదమున మనుత్వము సిద్ధించెనని తెలుపుటచే మూలమునందున్న స్వారోచి తపమును మనుచరిత్రమున స్వారోచిషునిచేఁ బెద్దన చేయించు టెంతయు యుక్తిసహమగును. సుచితము గను నున్నదనవచ్చును. స్వారోచి తపమునే వదలివేయుటచే తత్ప్రేరకమైన మూలము లోని మూడవదగు హంసీయుగమువాదము ప్రయోజనరహిత మగుటచే దానిని గూడ పెద్దన వదలివేయు టెంతయు సముచితముగా నున్నది.

మూలములో స్వారోచిని బ్రహ్మ మనువుగా చేసినట్లుండగా మనుచరిత్రమునందు స్వారోచిని విష్ణుమూర్తి మనుత్వమునకు పట్టముగట్టినట్లుగా మార్చి వ్రాయబడినది. ఈ చిఱు మార్పునకుఁ గారణము 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే' యను సూక్తి ననుసరించి ప్రబంధమును మంగళాంత మొనరించుటకే. మనుచరిత్ర చివఱయందిట్లు మంగళస్వరూపుడగు విష్ణు సాక్షాత్కారము స్వారోచికి గలిగించి యతనిచే భగవానుని దశావతారములను వర్ణింపఁజేసి మనుచరిత్రమును పెద్దన మంగళాంతముగా నొనరించెను. ఇంత మాత్రమేకాదు. పీఠికలో "స్వారోచిషమనుసంభవ... కలిధ్వంసి" యని తాను నుడివిన ప్రకారము మనుసంభవ కథాశ్రవణమే కలిదోషనాశకమగుచుండగా దానికి విష్ణ్వవతారస్తోత్రమునుఁ జేర్చి గావించి యేతత్ప్రబంధ శ్రవణ పఠన లేఖనాదులు నిజముగా కలివిధ్వంసము లని తోపఁజేసినాడు పెద్దనామాత్యుడు. మూలమున లేని విధమునఁ బెద్దన మనుచరిత్ర ఫలశ్రుతియందు 'కోరిక నీ స్వారోచిష చారిత్రము వినిన వ్రాయఁ .. .. ....... .. .. ....... ..............సంద్రదు పిదప నమరత్వంబున్.' అని మనుచరిత్రమును వినుట, జదువుట వలననేకాక దీనిని "మాటి వ్రాయుట" యనఁగా బ్రతిలిఖించుట వలనను ఆరోగ్యాదులనొంది పిదప నమరత్వమును బొందుదురని వ్రాసెను. ఇట్లు వ్రాయుటకు గారణమేమి? నేఁటివలె పెద్దనకాలమున కాగితము, ముద్రాయంత్రశాలలును లేనందుచేఁ దాళపత్రములయందు గ్రంథకర్తలు తమ గ్రంథములు వ్రాసియుంచు చుండుటయుఁ దెలిసినదే. ఇట్టి స్థితియందు గ్రంథకర్త తన గ్రంథమును పెక్కు ప్రతులని వ్రాయఁగలఁడు? వ్రాయింపఁ గలఁడు? కొద్ది ప్రతులే యుండినచో నవి కొంతకాలమునకు శిథిలములై గ్రంథము మృగ్యమయి పోగలదను తలంపు గలవాడై పాఠకులతోడనే కొన్ని ప్రతులైన వ్రాయింపనెంచి వారినిఁ బ్రోత్సహించు నుద్దేశముతో నిట్లు ఫలశ్రుతిలో మనుచరిత్రమునుజూచి ప్రతి వ్రాయుటయు పుణ్యమనియు, దానిచే నిహలోకమున నారోగ్యైశ్వర్యాదులును, జీవితానంతరమున నుత్తమలోక ప్రాప్తియుఁ గల్గునని వ్రాయవలసి వచ్చెనని మన మూహింపవలెను. రామకోటి, శివకోటి మొదలగునవి వ్రాయుట పుణ్యకార్యముగా విశ్వసించు విధముననే పుణ్యకథా బోధకములగు గ్రంథములకు బ్రతులు వ్రాయుటవలనను బుణ్యము గలుగునని మన పూర్వు

విశ్వసించుచుండిరి. ముద్రణ సౌకర్యములేని పూర్వకాలమున తమ కావ్యపురాణాదులను శాశ్వతముగ లోకమునందు నిలిపియుంచి వానిని ప్రచారమునకు దెచ్చు తలంపుతో మన పూర్వులు గ్రంథముల నడుమ నడుమను, చివరయందును తత్తత్ఫలకములగు 'ఫలశ్రుతు' లను వ్రాయుచుండిరని దీని వలన తెలియుచున్నది. పెద్దనకుఁ బూర్వకవయితలలో ననేకులు నిట్లే వ్రాసిరి. ప్రతులు వ్రాయుట కూడఁ బుణ్యకార్యమని త్రికరణశుద్ధిగా విశ్వసించుకాలము పెద్దనది. ఇట్లు మార్చి చెప్పుట యెంతయు సమంజసముగా నున్నది.

## పొత్తి పేళ్లు :

మూలమునందలి కొన్ని పేళ్లయందును పెద్దన స్వతంత్రించి కొంత మార్పుఁ గావించెను. ఇది అంత ముఖ్యముగాకున్నను మార్పుకావునఁ జేర్పకనుండఁ దప్పదు.

మనోరమ చెలిపేరు మూలమున 'విభావరి' యని యుండఁగా దీనిని బెద్దన 'విభావసి'గా మార్చెను. ఇట్లే విభావరిని ప్రేమించిన 'దేవాది' యను ఖేచరుని పేరును 'దేవాపి' యనియు, విభావరి పుత్రికగు 'మేరునందు'ని 'మేరునందను'ఁ డనియు, విభావరి పుత్రుఁడగు 'ప్రభాసు'ని 'విభాసుఁడ'నియు, మరియు 'నందవతి' 'తాళం' అను పురములనుఁ గ్రమముగా 'గంధవతి' 'ధారానగరము'లుగను మార్చెను. ఈ నామములనుఁ బెద్దన యిట్లు మార్చుటకుఁ బ్రత్యేక కారణము గనిపించదు. విమర్శకు లీ మార్పు సమంజసముగా నున్నదని మాత్రము వ్రాసిరి. కాని కారణముఁ దెలుపరైరి. ఈ మార్పునకు బలవత్తర కారణమేదియుఁ గానుపింపదు. కాని దీని కిట్లు చెప్పవచ్చునేమో? పెద్దన గ్రహించిన కథ మార్కండేయములోనిదే కావున దానిని తానున్నది యున్నట్లే వ్రాసినచో నిందు నీవు చేసినదేమి? ఉన్నది యున్నట్లు చెప్పితివే? యని యాక్షేపించు పండితులో ప్రతిపక్షులో పెద్దన సమకాలమున నుండిరేమో? ఏల యుండరాదు? మార్కండేయ పురాణమునందలి వరూధినీ ప్రవరాఖ్యుల కథనే తెనుగున అనియు, అపహాస్యదమును అదుణాస్పదమనియు పెద్దన వ్రాయుటచే నివి తెలుగు మార్కండేయ పురాణమునందలి పద్యములకు అనుకరణములని చెప్పుచు విమర్శించు పెద్దలు నేటికిని యుండగా నాడుండిరేమో యని తలఁచుట సాహసము కాఁజాలదు. కావున నిట్టివారికి వాతట్టు గట్టుటకే పెద్దన యిట్లు మూలమునందలి నామాదులయందును గొంత మార్పుగావించి తన స్వాతంత్ర్యమును గనపఱచియుండెనేమో యని యూహింపవచ్చును. ఈ యూహ యథార్థము కాక ఊహామాత్రము కావచ్చును.

మొత్తముమీద మార్కండేయ పురాణమునందలి మూలకథలో పెద్దన యేయే చిన్న పెద్ద మార్పుల నేలగావించెనో, వాని యౌచిత్యమెట్టిదో యను విషయములను బరిశీలించితిమి. దీనివలన కవిత్వమునందే కాక కథా కథనమునందును గడుజాగరూకత వహించి పౌర్వాపర్యముల నాలోచించి, యౌచితి నెఱింగి పెద్దన తన రచనాచాతుర్యమును బ్రదర్శించినవాడయ్యెననియు గుర్తింపఁగలిగితిమి. ఈ విషయమునందును పెద్దన తదనంతర ప్రబంధ కవుల కనేకులకు మార్గదర్శిత్వమును వహించెను.

# దక్షిణ దేశంలో హిందీ వ్యతిరేకోద్యమ స్వరూపమేమిటి?

— శ్రీ మోటూరి సత్యనారాయణ

స్వరాజ్యప్రాప్తి పూర్వం హిందూముస్లిం ఐక్యత భారతదేశంలో ఒక సమస్యగా ఉండేది. ఆ సమస్యకు సంబంధించిన పరిస్థితిని, లోతులనూ తెలుసుకొనడానికి కొంత సమయం పట్టడం వలన మహాత్మాగాంధీజీవంటి త్యాగనిరతుని సహాయం లభించినాగూడా దేశం తొందరలో ఆ సమస్యను పరిష్కారం చేసుకొనలేకపోయింది. దానికి ఫలితంగా ఆ సమస్య చివరకు భయంకర రూపాన్ని ధరించి దేశం రెండు ముక్కలై పోయింది. ఈనాడు తిరిగి ఆ రెండు ముక్కలనూ కలపడానికి ఎవ్వరికీ సాహసం లేకుండా పోయింది. దేశంలో బయలుదేరిన ఈ సమస్యను ఆ రోజుల్లోనూ పరిష్కరించుకొనలేక పోవడానికి కారణం స్వరాజ్య ప్రాప్తికి అవసరమైన ఐక్యత అనే నినాదాన్ని పరిస్థితి గుర్తించకుండా మనం భావనాత్మకంగా చేసివేయడమే. ఏ క్షేత్రంలోనూ అనేకత్వాన్ని చూడడానికే మనం ఆరోజుల్లో ఓపిక లేకుండా పోయింది. ద్వైతభావన మనకు సహించరానిదై పోయింది. ద్వైతంవల్ల సంభవించే ఆపదలను భయభీతులమయి పోయినాము. మనం ఎదుర్కొనవలసిన శత్రువు మన మధ్యనే ఉండడంగూడా దానికి కారణం కావచ్చును. ఏమైనా అనేకత్వాన్ని, జాతికులతత్వాన్ని, రాజకీయరంగంలోనేగాక మిగతా ఏరంగంలోనూ చూడడానికి సిద్ధంగా లేక భావోద్రేకంలో మనం సహనశక్తిని కోల్పోయినాము. అంతేగాక మన అభివ్యక్తి విధానంలో తీవ్రత ఏర్పడడంవలన దానిలో హింస ప్రవేశించినట్లయింది. స్వరాజ్యాన్ని పొందవలెననే ఏకాగ్రతలో దేశంలోని ఏకోన్ముఖ ఆలోచనా శక్తి - సమ్మిళిత ఆలోచనా శక్తి - లుప్తమై పోయింది. దానికి ఫలితంగా దేశంలోని ఒక పెద్దముక్క చేయి జారిపోయింది. మహాత్మాగాంధీలాంటి జగద్గురువు బలియైపోయినాడు.

స్వరాజ్యం లభించిన తరువాత భాషాసమస్య అదేపద్ధతిలో భయంకర రూపంలో ఈనాడు మన ముందుకు వస్తున్నది. ఢిల్లీ పార్లమెంటులో ఈ సమస్యపై కావలసినంత చర్చ జరిగింది. ఈ సమస్య కారణంగా పార్లమెంటు భగ్నమై పోతుందా అన్న సందేహంగూడా కలిగింది. అట్టి పరిస్థితి ఏర్పడడం వలన దేశానికి పెద్ద దెబ్బ తగిలింది. ఆ దెబ్బకు దేశం ఊగినట్లయిపోయింది. కాని మన రాష్ట్రపతి రాజేంద్రబాబు సంయమనశక్తి, కీ. శే. వల్లభభాయి కాఠిన్యమూ, జవాహర్

పండితుని దూరదృష్టి పరిస్థితిని చక్కబరచినవి. చివరకు మననాయకుల మార్గాన్ని అసెంబ్లీ అనుసరించింది. భాషాసమస్యకు సంబంధించిన ఒడంబడికలు జరిగినవి. ఆ ఒడంబడికలు ప్రాంతీయత, జాతీయతలవంటి అనేకదృష్టులతో భారతదేశ అంతిమ లక్ష్యమైన అనేకత్వంలోనుండి ఐక్యతనూ, ఐక్యతలోనుండి అనేకత్వాన్నీ సాధించ డానికి వీలుగా జరిగినవి. రాజ్యాంగ చట్టంలోని 17 వ అధ్యాయాన్ని మనం పూర్తిగా చదివితే అసలు మన సమస్యలేమిటో వాటిని పరిష్కరించుకొనడానికి మనం ఏమేమి చేసుకొన్నామో అర్థమవుతుంది. మన సమస్యలు ముఖ్యంగా మూడు. 1 ఇంగ్లీషు-భారతీయ భాష. 2. హిందీ - హిందుస్తానీ. 3. ప్రాంతీయభాష - రాష్ట్రభాష. ఈ మూడు సమస్యలు బయలుదేరడానికి కారణం ఒక్కటే. కేంద్రప్రభుత్వపుభాష ఏ భాష అవుతుంది. దాని వలన ఏ ప్రాంతానికి ఎంతలాభం సమకూరుతుంది. ఏ ప్రాంతానికి తొందరగా, ఏ ప్రాంతానికి ఆలస్యంగా లాభం చేకురుతుంది. ఎవ రికిలాభం ఎక్కువ చేకురుతే, ఎవరికి అసలు చేకురనే చేకురదు అనేదీ ఆకారణం. 1918 సంవత్సరంలో స్వరాజ్యప్రాప్తికి సాధనంగా ప్రారంభించబడిన హిందీ ప్రచారం స్వరాజ్యం లభించిన తరువాత తగాదాలకు కారణమై కూర్చున్నది. తగా దాలను లేకుండా చేయడానికి రాజ్యాంగ చట్టం అమలులోనికివచ్చిన తరువాత భాషా కమీషన్‌ను ప్రారంభించవలెనని రాజ్యాంగ చట్టంలో ఒక కొత్త సూత్రం చేర్చ బడింది. ఇప్పుడు కమీషన్ నియమించబడింది.

ఈ కమీషన్ నియమించడానికి కొంచెం పూర్వమూ నియమించిన తరువాత గూడా తిరిగి వెనకటి తుఫాను మళ్ళీ బయలుదేరినట్లు కనపడుతున్నది. వెనకటి పాతమాటలన్నీ మళ్ళీ పల్లె వేయబడుతున్నవి. ఇంగ్లీషు అంటే అభిమానం కలిగిన అహిందీ ప్రాంతాలలోని విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఇంగ్లీషు లోటను వృథ పరచ డానికి ప్రయత్నంచేస్తున్నారు. ప్రాంతీయ భాషావాదులు హిందీనీ, ఇంగ్లీషునూ రెండింటినీ తొలగించి ఆ స్థానాలలో ప్రాంతీయ భాషను ప్రాధాన్యత పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ పది సంవత్సరాలలో ఒక్కహిందీ హిందుస్తానీ తగాదా ఒక్కటిమాత్రం ఎక్కువగా వినపడలేదు. హిందుస్తానీవాదులు మారిన దేశపరిస్థితు లను గమనించి దేశ వాతావరణంలో కలిసి పోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. హిందీ కమీషన్ నియామకంతో అందరికంటే ఎక్కువగా దక్షిణదేశం ఎక్కువ భయపడుతున్నట్లు కనపడుతున్నది. కమీషన్ సభ్యులు దేశమంతటా పర్యటన ప్రారంభించినప్పుడు అసలు భాషాసమస్య ఏ ప్రాంతంలో ఏ రూపంలో ఉన్నదో తెలుసుంది.

అసలు ప్రతి ఉద్యమానికీ కొన్నికొన్ని వేరువేరు దశలుంటవి. ఉద్యమం వికాసం పొందుతున్నకొద్దీ దేశపరిస్థితులనూ, దేశలక్ష్యాన్నీ, దేశవ్యాపకత్వాన్నీ దృష్టిలో పెట్టుకొంటే ఇటువంటి "దశలు" ఏర్పడడం స్వాభావికమే. హిందీ ప్రచారోద్యమంలోకూడా అటువంటి దశలు ఏర్పడడం స్వాభావికమే. ఈ ఉద్యమం ప్రారంభదినాలలో రాష్ట్రభాషా ప్రచారోద్యమమని పిలవబడింది. జాతీయత, జాతీయైక్యత ఆనాటి మన లక్ష్యం. అందువల్లనే మహాత్మాజీ ప్రాంతీయ సరిహద్దులను లెక్కించకుండా ఈ ఉద్యమాన్ని దేశం నలుమూలలా వ్యాపింపజేశారు. మొట్టమొదటి సారిగా 1918 లో హిందీ రాష్ట్రభాషఉద్యమంలో వింధ్యనుదాటి దక్షిణ భారతంలో అడుగుపెట్టింది. దక్షిణదేశప్రజలు హిందీ స్వరాజ్య సందేశ వాహిని అని భావించారు. కన్యాకుమారినుండి హైదరాబాదు, బరహాంపూర్‌నుండి బెళ్గాంవరకు మధ్యనున్న రెండున్నర లక్షల చదరపుమైళ్ళు గల భూభాగం యావత్తూ హిందీని ఏకగ్రీవంగా రాష్ట్రభాషగా అంగీకరించింది. ఈ ఉద్యమానికి వ్యతిరేకంగా మధ్య మధ్య కొంత ప్రచారం జరగక పోలేదు. కొన్నికొన్ని చోట్ల హిందీ తీవ్రంగా వ్యతిరేకింపబడింది. కాని దక్షిణ భారత హిందీ ప్రచారసభ తన వ్యవహారచతురత వలన ఆ వ్యతిరేకతను మాయం చేసివేసింది. ఎంతో దూరదృష్టితో దక్షిణభారత హిందీ ప్రచారసభ ప్రాంతీయ భాషల ప్రచార బాధ్యతనుగూడా తన నెత్తిమీదపెట్టుకొన్నది. ఈనాడు వేలసంఖ్యలో దక్షిణదేశమంతటా వ్యాపించిన హిందీసభ కార్యకర్తలు హిందీ, ప్రాంతీయభాషా రెండూ తెలిసినవారుగా పరిగణింపబడుతున్నారు. వారు రెండు భాషలకూ సేవచేస్తున్నారు. దీనివలన ప్రాంతీయభాషా పండితులు ఈ ప్రచారంవలన ప్రాంతీయ భాషలకు లాభమేగాని నష్టంలేదని తెలుసుకొన్నారు. అటువంటి విశ్వాసం వారికి కలిగింది. సభ అనుసరించిన విధానం వల్ల ప్రాంతీయ భాష, రాష్ట్రభాషలస్థానాన్ని గురించి బయలుదేరిన పొరపాటు అభిప్రాయాలు చాలా వరకు తొలగి పోయినవి. ఈనాడు హిందీ ప్రచారసభ కార్యకర్తలన్నా, హిందీ ప్రచారసభ అన్నా ప్రజలలో చాలా ఆదరణ కన్పిస్తున్నది.

సామాన్య భాషకు సంబంధించిన ఉద్యమంలో రెండవ దశలో ఆ భాషపేరు ఏమి? ఆ భాష స్వరూపమేది? అనేవిషయంమీద తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఏర్పడ్డవి. 1941 నుండి పది సంవత్సరాల వరకు ఈ విషయంలో తీవ్రమైన వాదోప వాదాలు జరిగినవి. మహాత్మాజీ హిందుస్తానీ అని సామాన్య భాషకు నామకరణం చేశారు. అది తేలిక హిందీ, లేక తేలిక ఉర్దు అని ఆయన నిర్వచనం చేశారు. రాజ్యాంగ చట్టంలోని 351 వ సూత్రంలో హిందుస్తానీ అనే పేరున్నా

గూడా చేర్చి మన రాజ్యాంగ నిర్మాతలు భాషా సమన్వయం చేసివేశారు. ఈసూత్రం హిందీ తన ఆత్మను పోగొట్టుకొన కుండా హిందూస్తానీ మరియు 8 వ అనుసూచిలో ఉల్లేఖింపబడిన పదునాలుగు భాషల సహాయంతో పెంపొందగలదని చెప్పుతున్నది. ఆ పదునాలుగు భాషల్లో హిందీ గూడా ఒకటే. రూపము, శైలి, పదావళి మొదలగువాని విషయంలో గూడా ఈ సూత్రం స్పష్టంగా ఉన్నది. ఇతర భాషలనుండి శబ్దాలు తీసుకొనడం ఈ సూత్రం ప్రకారం నిషిద్ధం గాదు.

ఆ పదునాలుగు భాషల్లో సంస్కృతము, ఉర్దు గూడా ఉన్నవి. ఆ రెండింటికి ప్రత్యేకమైన భాషా ప్రాంతాలు లేవు. మిగిలిన పన్నెండు భాషలకూ వేరువేరు ప్రాంతాలున్నవి. ఆ ప్రాంతాలు తమతమ రాజ్యాల ద్వారా బలాన్ని పెంచుకొనడానికి ప్రయత్నం చేస్తున్నవి. తమతమ క్షేత్రాలను విస్తరింప జేసుకొనడానికి గూడా ప్రయత్నిస్తున్నవి. ఇదేకారణంవల్ల ప్రాదేశిక భాషలు రాజనైతిక ప్రయోజనాలు సాధించే భాషలుగా మారుతున్నవి. ఈ భాషల్లో హిందీ గూడా ఒకటి. ఇతర భాషలవలెనే హిందీ గూడా తన క్షేత్రాన్ని తాను రక్షించుకొనే ప్రయత్నం చేస్తున్నది. ఇతర భాషల కంటే హిందీకి ఉన్న ప్రదేశం విశాలమైనది. భారత దేశం మొత్తంలో 40 పంతులు భూమి హిందీ ప్రదేశంగా ఉన్నది. తెలుగు మహారాష్ట్రి భాషలకు 10 పంతుల ప్రదేశముంటే మిగతాభాగమంతా మిగిలిన 9 భాషలమధ్య విభక్తమై ఉన్నది. కనుక ఇతర ప్రాంతీయ భాషలు హిందీని సందేహ దృష్టితో చూడడం స్వాభావికమే. ఈ సందేహాన్ని పోగొట్టడానికే 351 వ సూత్రంలో హిందీ ఆ భాషలన్నింటినుండి సహాయాన్నిపొంది వికసించవలెననే సూత్రం పొందుపరచ బడ్డది. హిందీ వికాసం ప్రాంతీయ భాషగా ఉన్న హిందీ భాష మాట్లాడేవారి ద్వారా గాక రాష్ట్రీయ హిందీని మాట్లాడేవారి ద్వారానే వికాసాన్ని పొందగలదు. జరిగేది అంతే. వికాసావస్థలో హిందీలోకి ప్రవేశిస్తున్న కొన్ని రూపాలను చూచి హిందీ మాతృభాషగా గలవారు బాధపడుతున్నారు. ఈ బాధపడడం స్వాభావికమేకాని అందులో అసమంజసమైన ఆత్మీయతకు సంబంధించిన అనురక్తి ఉండడంవలన అటువంటివి జరుగుతున్నది. హిందీ అహిందీ క్షేత్రాలలో రెండింటిలో హిందీ వికాసం పొందక తప్పదు. హిందీవారికి బలం ఎక్కువ ఉండడంవలన (ఈహిందీని) ఎవ్వరూ వికృతం చేయలేరు. ప్రాదేశిక హిందీ గూడా అనేకత్వం కలిగియే ఉన్నది. దానికి కారణం విశాల భూభాగంలో అది ప్రచలితంగా ఉండడమే. అది తన ఆత్మను ఎప్పుడూ పోగొట్టుకోలేదు. రాష్ట్రభాషా ఉద్యమంలో అన్నింటికంటె మించిన జటిల సమస్య ప్రాంతీయ హిందీకి మిగిలిన ప్రాంతీయ భాషలకూ సమన్వయం

కుదిరించడంలోనే ఉన్నది. పరస్పర సహానుభూతి, సహనశీలత్వమూ లేనిదే ఈ సమన్వయం కుదరడం చాలాకష్టం. కనుక ఇటు హిందీ, అటు మిగిలిన ప్రాంతీయ భాషలూ ఒక్కసారిగా అభివృద్ధి పొందడం మీదనే రాష్ట్రీయ హిందీ వికాసం ఆధారపడి ఉన్నది. భారతదేశంలోని అన్ని ప్రాంతీయ భాషలూ సమాన రూపంలో సమానస్థాయిలో వికాసం పొందవలసి యున్నది. ఆయా భాషల స్థాయి గూడా సమానంగా ఉండవలెను. ఆనాడే భాషాసమస్య పరిష్కారం కాగలుగుతుంది.

రాష్ట్రభాషా ఉద్యమం మూడు దశలను అతిక్రమించి ఇప్పుడు నాలుగో దశలోనికి ప్రవేశిస్తున్నది. మొదటిది రాష్ట్ర భాషా ఉద్యమం. ఆ ఉద్యమం జాతీయ చైతన్యాన్ని పెంపొందింప జేయడానికే బాగా ఉపకరించింది. ఆ ఉద్యమాన్ని దేశం ఎక్కువగా ప్రోత్సహించింది. ఆనాడు రాష్ట్ర భాషమీదట ఏ ప్రాంతంలోనూ వైమనస్యభావం లేదు. హిందుస్తానీ ఉద్యమం రెండవదశ. మనదేశంలో జాతి, మత వర్గ భేదాలకు ప్రాముఖ్యత ఉన్నంతకాలం ఈ వివాదం ఉండకమానదు. మూడవ దశ హిందీ - ప్రాంతీయ భాషల వైరుధ్యం. ప్రాంతీయ హిందీ ఇతర ప్రాంతీయ భాషలతో సరిగా వ్యవహరించి వాటిని తనలో కలుపుకొనగలగాలి. అది జరగనంత కాలం ఆ తగాదాలు ఉండక తప్పదు. నాలుగో దశ రాజభాషా ఉద్యమం. ప్రస్తుతం దీనికి అన్నిటికంటె ఎక్కువ ప్రాముఖ్యత ఏర్పడి ఉన్నది. ఈ ఉద్యమానికి మన దేశంలోని బుద్ధిజీవులతో సంబంధం ఎక్కువ. ఆ బుద్ధి జీవులు ప్రభుత్వోద్యోగాలమీద ఎక్కువగా ఆధారపడుతూ ఉంటారు. ఆ ఉద్యోగాలకొరకై రాజ్యశక్తిని తమ ఆధీనం చేసుకొనవలెనని ఆరాటపడుతుంటారు. కనుకనే రాజభాషకు సంబంధించి విచారణ చేయడానికి హిందీ కమిషన్ ఏర్పడడంతోనే హిందీ విరోధశక్తులు ఒక్కసారి పైకి తల ఎత్తినవి. హిందీని ముఖ్యంగా ఏర్పరిస్తే అహిందీ ప్రాంతీయులు హిందీ వారితో పోటీచేయలేరని అహిందీ ప్రాంతాల వారు భయపడు తున్నారు.

ఈ భయం మరీ ఎక్కువగా దక్షిణదేశంలో వ్యాపించి ఉన్నది. దానికి రెండు ముఖ్యకారణాలు. అందులో ఒకటి ప్రస్తుతం తమ పరిశ్రమఫలితంగా ఇంగ్లీషును అధ్యయనంచేసి చాలామంది దక్షిణదేశస్థులు కేంద్రప్రభుత్వంలో అనేకచోట్ల అధికారాలలో ఉన్నారు. ప్రస్తుతం ఇంగ్లీషుకు ప్రభుత్వ ప్రభుత్వేతర రంగాలలో ప్రాముఖ్యత ఉండడంవలన కష్టపడి ఇంగ్లీషులో మంచి యోగ్యతను సంపాదించుకొని ఉన్నారు. ఇంగ్లీషుబలంతో ఈనాడు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా మొదలగు పట్టణాలలో లక్షలసంఖ్యలో దక్షిణ దేశస్థులు వ్యాపించి జీవనం గడుపుతున్నారు. హిందీ

తొందరగా నేర్చుకోలేమనీ, నేర్చుకొన్నా హిందీ మాతృభాషగా గలవారితో పోటీ చేయలేమని వారికి భయం ఏర్పడింది. కనుక ప్రభుత్వరంగంలో హిందీ మాధ్యమంగా స్వీకరించబడడానికి ఎంత ఆలస్యంజరిగితే అంతమంచిదని వారిఅభిప్రాయం. రెండో కారణం ఏమంటే దక్షిణభాషలు హిందీకి అంత సమీపమైనభాషలుకావు. తెలుగు, మలయాళ, కన్నడభాషలకంటే తమిళం హిందీకి మరీదూరంగా ఉన్నది. తమిళ సోదరులు హిందీనేర్చుకోడానికి ఎక్కువ సమయం అవసరమవుతున్నది. ఈ యిబ్బందిని తొలగించడానికి సమయమూ కావాలి. అంతేగాక తమిళ భాషనూ, తమిళ భాషాశబ్ద స్వరూపాలనూ ప్రభావితం చేయాలి. ఈ పని తప్పక జరుగుతుంది. కాని దీనికి కొంతకాలం వేచి ఉండాలి. దక్షిణ దేశంలోని ఆంధ్ర, కర్ణాటక కన్నడ ప్రాంతాలలో హిందీ అంటే తమిళనాడులో ఉన్నంత వ్యతిరేకత లేనట్లు కనపడుతున్నది. తీరా ఇంగ్లీషును తీసివేసి హిందీని ప్రవేశపెడితే ఆ ప్రాంతాల పరిస్థితిగూడా ఏవిధంగా తయారవుతుందో అప్పుడే చెప్పలేము. వ్యతిరేకత ఉండదని అనుకోడంగూడా పొరపాటే. ఎందువల్లనంటే విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషు ప్రాధాన్యత తగ్గలేదు. ఉద్యోగాలు లభించడానికి విశ్వవిద్యాలయాల డిగ్రీలే సాధనంగా ఉన్నవి. దక్షిణదేశంలో హిందీ నేర్చుకోము అని ఎవ్వరూ అనడం లేదు. రాష్ట్రభాషకుగానీ, హిందీకిగానీ, హిందుస్తానీకిగానీ దేనికీ దక్షిణదేశం వ్యతిరేకంగా లేదు. ఉన్న వ్యతిరేకత అంతా రాజభాషకే. రాజభాషలో సంపాదించిన యోగ్యతాపత్రము ప్రభుత్వోద్యోగాలు పొందడానికి సాధనం కావడమే ఆవ్యతిరేకతకు కారణం. కనుక ఇది సాంస్కృతిక సమస్యగానీ, సాంఘిక సమస్యగానీ, భాషకు సంబంధించిన సమస్యగాని కానేరాదు. ఇది జనుల జీవిక నిర్వహణకు సంబంధించిన సమస్య. అందువల్లనే దీనిలో ఆవేశం, ఆగ్రహం ఎక్కువగా కనపడు తున్నది. ఈ సమస్యను పరిష్కరించడానికి ఒక్కటే ఉపాయం ఉన్నది. ఆ ఉపాయమేమంటే ప్రభుత్వోద్యోగాలలో ఉన్నవారికీ, ఆ ఉద్యోగాలలో చేరదలచుకొన్న వారికీ ప్రత్యేక సదుపాయాలు కలిగించడమే. ఇదిగూడా ప్రభుత్వము పనులలో ఒకటి గనుక ప్రభుత్వపక్షాన అందుకు అవసరమైనంత డబ్బునుగూడా ఖర్చుపెట్టాలి.

పైనచెప్పిన నాలుగు దృష్టులతో భారతదేశంలో హిందీ ప్రచారం జరుగుతున్నది. ఈ నాలుగు దృష్టులూ ఒకదానినొకటి పూరించేవేగాని ఒకదాని కింకొకటి వ్యతిరేకమైనవికావు. ప్రస్తుతం దేశంలో కన్పించే అభిప్రాయభేదాలు ప్రతివారూ తమమాటే గెలువవలెననీ పట్టుబట్టడంవల్ల ఏర్పడుతున్నవేగాని అన్యంకాదు. కనుక రాష్ట్రభాషాప్రచారం చతుర్ముఖాలతోనేగాక నాలుగు రంగాలలో జరగవలెను.

వ్యాసము :

# మరాఠీ సాహిత్యము - ఉత్తర మధ్యయుగము

శ్రీ ఎ. వి. వేఖిల్ గాఁవ్ కర్, ఎం. ఏ.

మరాఠీ సాహిత్యం పద్యంతో ప్రారంభ మయింది. మధ్యయుగం వరకు భక్తి ఆధ్యాత్మిక చింతన కావ్యవస్తువులుగా ఉంటూ వచ్చినవి. ఆత్మజ్ఞానాన్ని జనసామాన్యానికి అందజేసే "ప్రాకృతమార్గం" ముకుంద రాజుతో ప్రారంభమై మధ్యయుగం చివరి వరకు అవిచ్ఛిన్నంగా వ్యాప్తమవుతూ వచ్చింది. ఏకనాథుని గ్రంథాలను చూస్తే మరాఠీ సాహిత్యం పండితులకూ పామరులకూ అర్థమయ్యేటట్లుగా మార్పు చెందినదనీ, దానిలో లౌకిక విషయాలకు కూడా ప్రవేశం లభించిందనీ తెలుస్తుంది.

మధ్యయుగ సాహిత్యంలో ముక్తేశ్వరుడు ప్రముఖుడని అని చెప్పవచ్చును. ముక్తేశ్వర విరచితాలైన అన్ని కృతులూ లభించలేదు. అయినా ఇంతవరకు లభించిన వాటిని బట్టి చూస్తే ముక్తేశ్వరుడు మరాఠీ సాహిత్య రంగంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. ముక్తేశ్వరుని రచనలలో పాండిత్యము రసాభివ్యక్తి పరిపూర్ణత్వాన్ని పొందినట్లు చూస్తాము. సంక్షిప్త రామాయణము, ఋష్యశృంగ సంవాదము, శతముఖ రావణవధ, ఏకనాథ చరిత్ర, గజేంద్ర మోక్షము, హనుమంతాఖ్యానము ఆయన ప్రముఖ కృతులు. మరాఠీ సాహిత్యంలో బయలుదేరిన "సంతపంతుల"ను ముక్తేశ్వరుడే పూర్వదిగా కూడా కనపడుతుంది. వ్యాసుడు చేయని పనిని తాను చేస్తున్నట్లూ వ్యాసుడు చూడని విశేషాలను తాను చూపుతున్నట్లూ భావించి ఆత్మ విశ్వాసంతో ముక్తేశ్వరుడు మహాభారత రచన చేశాడు. ఒకచోట ముక్తేశ్వరుడు

సాంగో జనలో వ్యాస
పరిహ్యా స్వకీజ దిశతే"

అన్నాడు. తన రచనల్లో ఆనాటి దేశపరిస్థితులనూ, ఆచార వ్యవహారాలనూ, రీతి రివాజులనూ అన్నింటినీ ముక్తేశ్వరుడు తన రచనల్లో ప్రతిబింబింప జేశాడు. సాంఘిక జీవిత చిత్రణపు గాను ఏకనాథాదులు రామాయణాన్ని రచించినట్లుగానే ముక్తేశ్వరుడు మహాభారతాన్ని రచించాడు. సన్యాస, గార్హస్థ్య ధర్మాదుల పూర్తి విషయంలో జనులలో బయలుదేరిన భ్రమాత్మకమైన ఆలోచనలను దూరం చేయడానికి ముక్తేశ్వరుడు ప్రయత్నించాడు. ఆరణ్య పర్వంలో ద్రౌపదీ ధర్మరాజుల మధ్య జరిగిన సంభాషణ చూడండి :

సాధలియా స్వరాజ్య సంపత్తి
యతీదేవ తృప్తహోరీ
శ్రాద్ధీ పితృగణ అతిధి
అన్నదానే తోషతీ
హరేలా దారిద్ర్యాంచే దుఃఖ
మిత్రబంధు పావతీ సుఖ

అనిత్య సంసారీ రౌతుక్
కిరూసీ జాతి దాదరే
ప్రపహారే శాంతి సయే కామా
పరమార్థే క్రోధనాశో ధర్మా
చేద్రై జ్యా చాచీ మహిమా
తే తేదేచీ యోజావే
ఒగా కుటీగాచే రాయా
శాంతీ ధరితా పడణే అపాయీ
జైసే కంటక మర్దానేపాయీ

నారదనీతిని వివరిస్తూ ఉత్తముడైన రాజు ఏవిధంగా ఉంటాడో ముక్తేశ్వరుడు వర్ణించాడు. విదేశీయుల శాసనం వలన సంఘంలో మతస్వాతంత్ర్యమూ ఆచారాదులూ నష్టమై పోతూంటే దానిని లక్ష్యంలో ఉంచుకొని మూలకథకు కొంచెం దూరంగా ఉన్నా ముక్తేశ్వరుడు భౌతిక పరిస్థితిని తన కావ్యంలో వివరించాడు. సారాంశమేమంటే సూక్ష్మావలోకనం, బుద్ధివైశాల్యము, కల్పనావైభవం, వర్ణనాచాతుర్యం మొదలగు గుణాలతోబాటు ఆయన రచనల్లో జాతీయభావాలు గూడా ప్రతిబింబించడంవలన మరాఠీ సాహిత్యంలో ముక్తేశ్వరునికి విశిష్ట స్థానం లభించింది.

ముక్తేశ్వరుని తరువాత మరాఠీ సాహిత్యరంగంలో ఇద్దరు మహాపురుషులు ప్రవేశించారు. ఒకడు తుకారామ్; రెండోవాడు రామదాసు. వీరిద్దరూ మహా "సంతు"లు. వీరిద్దరి జీవిత ప్రవాహాలూ వేరువేరు దిక్కులలో ప్రవహించినవి. ఒకడు గృహస్థయితే ఇంకొకడు బ్రహ్మచారి. ఒకడు అశిక్షితుడైన వైశ్యుడు, ఇంకొకడు సుశిక్షితుడైన బ్రాహ్మణుడు. ఒకడు భక్తిమార్గాన్ని అనుసరిస్తే ఇంకొకడు కర్మ, జ్ఞానాలను ఆశ్రయించి యోగి అయినాడు. కలియుగంలో భక్తిమార్గం ఒక్కటే భగవత్ప్రాప్తికి సాధనమని నమ్మి నామ సంకీర్తనకుమించిన తరణోపాయం లేదని తుకారామ్ విశ్వసించాడు. అదేమార్గంలో జీవితసాధన చేశాడు. తుకారామ్ పూర్వీకులు అందరూ పండరిపుర నివాసులైన విఠలనాథుని భక్తులు, బాల్యకాలంనుండి. తుకారామ్ అనేకమైన కౌటుంబిక కష్టాలను అనుభవించవలసి వచ్చింది. విశేష ధననష్టము, కరువు, ప్రియజన వియోగము మొదలగు అనేక కష్టాలు ఆయనను ఎంతగానో పీడించినవి. ఆపదలలో భగవంతు డొక్కడే సహాయపడతాడని నమ్మి తుకారామ్ పండరినాథుని ఆశ్రయించాడు. కీర్తన శ్రవణాదుల ద్వారా భక్తిమార్గాన్ని అనుసరించాడు. కొంతకాలం తరువాత స్వయంగానే కావ్యరచన ప్రారంభించాడు. ఇదిచూచి కొంతమంది సనాతన బ్రాహ్మణులు ఆయనను వ్యతిరేకించడం ఆరంభించారు. కాని అందువలన ప్రయోజనం ఏమీ కలగలేదు. ప్రతిభా సంపన్నుడైన వ్యక్తిని ఏ అడ్డంకులూ ఎదురించలేవు. రామేశ్వరభట్టులాంటి ప్రాణశత్రువులు గూడా ఆయనకు మిత్రులైనారు. తప్పుదోవన పోయే అనేకమందికి తుకారామ్ భక్తిమార్గాన్ని చూపించాడు.

తుకారామ్ దాదాపు 5500 వరకు అభంగాలను రచించాడు. ఈ అభంగాలలో దేశ మనోవృత్తి విస్తృతంగా చిత్రించబడింది. ఈ అభంగాలను ఉత్కృష్టమైన భావగీతాలని అనవచ్చును. ఈ అభంగాలను రెండు భాగాలుగా విభజించవచ్చును. మొదటిభాగంలో సాధకుని గాథలూ, సిద్ధుల సమాధానాలూ వివరించబడినవి. రెండవ భాగంలో స్వానుభవం వలన అనుభవంలోనికి వచ్చిన భక్తిమార్గము వివరించబడినది. గార్హస్థ్యధర్మం గూడా విపులంగా వర్ణించబడినది.

ఒకచోట తుకారామ్ —

సత్యవాదీ కరీ సంసార సకళ
అలిప్త కమల జళీ జైసే
భోగావరీ అష్ట్రు ఘాటలా పాషాణ
భోగీ పూజా త్యాగీ నిధి గాథా పాంపురంగ

అనాసక్తి లేక విరక్తి అనే దానికి సన్యాసమని అర్థంకాదు. ఈ విషయాన్ని తుకారామ్ ఒక అభంగంలో వివరించాడు.

సోడోనియా ధన ఉత్తమ వేవ్హారే
ఉదాస విచారే వేచ కరీ

మతం పేరుతో జూదమాడే వారిని తుకారామ్ ఈక్రింది అభంగంలో తీవ్రంగా విమర్శించాడు.

శాస్త్ర గధదా జనే దేహీ
తేచే రాశీ పాపాచ్యా
దాయా హోయా ముండీ మొండోనియా భిక్షా
పాంపురోని పసీ వస్త్రం కాయ

ధర్మపాలన ధర్మరక్షణ మని తుకారామ్ అభిప్రాయం.

ధర్మాచే పాలన్ కరణే పాషాండ ఖండనీ
హేచి ఆమ్హా కరణే కామ్.

నామమహిమను వర్ణిస్తూ తుకారామ్ అది మోక్షంకంటె గూడా శ్రేష్ఠమైనదని అన్నాడు కారణ మేమంటే మోక్షం తనంత తానుగా పరమేశ్వరుని ప్రసాదించదు.

దేవాపాశీ నాహీ మోక్షాచే గాంఠోడే
ఆణూనీ నిరాలే ద్యావే హాతీ
ఇంద్రియాంచా జయ సాధునియా మన
నిర్విషయ కారణ అసే తేథే

ఒక్కసారి గోవిందుని నామం లభిస్తే మనస్సు ఆనంద రూపాన్ని పొందుతుంది. అందువల్ల దేహభావం నశించి బ్రహ్మరూపాన్ని ధరిస్తుంది.

తుకారామ్, జ్ఞానేశ్వరుడు, నామదేవుడు, ఏకనాథుడు, కబీరు మొదలగు సత్పురుషుల గ్రంథముల నన్నింటినీ బాగా అధ్యయనం చేశాడు. సూత్రరూపంలో ఉండే తుకారాముని

వచనములవలన మరాఠీ భాషకు ఎంతో శోభ లభించింది. మరాఠీసాహిత్యం పరిపుష్టమైనది. జ్ఞానేశ్వర ఏకనాథుల కంటే తుకారాముని కవిత జనులను ఎక్కువగా ఆకర్షించింది. దానికి కారణం తుకారాము, శుద్ధ మరాఠీలో అభంగ రచన చేయడమే. అతని భావములు ఆధ్యాత్మ విజ్ఞాన వర్ధకములు కావడమే. తుకారామ్ కవితలో పాండిత్య ప్రదర్శనగానీ కళకొరకు కళఅనే తత్వంగానీ కనిపించదు. బహుజనులకు పనికివచ్చే భాషలో ఆయన రచనలు సాగించాడు. భావములు పాతవేగాని భాష సరళంగానూ, ఓజోగుణ యుక్తంగానూ ఉన్నది. తనకు జీవితంలో లభించిన అనుభవాలను ఆయన కవిత్వబద్ధం చేయడానికి ప్రయత్నించాడు.

దేశ దుస్థితిని చూచి తుకారామ్ చాలా విచారించాడు. ధర్మ భ్రష్టత్వం వల్లనే జనులు వైనాశ్యావస్థలో పడిపోయారనీ దానికి ధర్మరక్షణ చేయడం అన్నిటికంటె అవసరమనీ ఆయన భావించాడు. స్వధర్మ నిష్ఠను జాగృతంచేసి ధర్మప్రచారం చేయడానికి స్వరాజ్యం కావలెననే భావం తుకారామ్‌లో పాదుకొని పోయింది.

నిఘడే మాండవే గిధడేచే టీక
పీడితా రాష్ట్ర దేఖో నీ జగరాజా ప్రజాపీడా
కేల్రీ దుష్టాంచీ రాకీ.

రాష్ట్రోద్ధరణ అవసరమని తుకారామ్ తన మనస్సులో ఎంతగా పరితపించాడో మనకు ఈ అభంగం వలన అర్థమయింది. శివాజీ పరాక్రమాన్ని గురించి తెలుసుకొని ఇక రాష్ట్రం పరపీడననుండి విముక్తమవుతుందని విశ్వసించాడు. జీజాబాయి తన కుమారునకి శివాజీకి సత్పురుషుల ఆశీర్వాదం నీకు అవసరమని చెప్తూనూ బోధిస్తూ ఉండేది. తత్ఫలితంగా శివాజీ తుకారామును ఆదరించాడు. తుకారాముని కీర్తన శ్రవణంచేసి శివాజీ రత్నాలనూ, వజ్రవైడూర్యాలనూ ఆయనకు సమర్పించేవాడు. కాని తుకారామ్ వాటిని స్వీకరించేవాడు కాదు.

మానవంధ చేష్టా హేతో సూకరాచివిష్టా
దివట్యా ఛత్రే ఘోడే హేతో బన్యాంచలసవచే
అతా లేఫే పండరిరాయా మజగోవిసీ కాసయా

తుకారామ్ సమకాలికుడు సమర్థరాముదాసు. తుకారామ్ రామదాసు లిద్దరూ 1608 లోనే జన్మించారు. కాని తుకారామ్ 1649 లోనే స్వర్గస్థుడైనాడు. తుకారామ్ స్వర్గస్థుడైన తరువాత సుమారు 30, 32 సంవత్సరాలవరకు రామదాసు మహారాష్ట్రదేశంలో జాగృతిని కలుగజేశాడు. సమర్థ రామదాసు పర్భణీజిల్లా జామ్ అనే గ్రామంలో జన్మించాడు, తుకారాముని కాలంవరకు మహారాష్ట్రంలో ప్రచలితంగా ఉన్న భక్తిమార్గాన్ని సమర్థరామదాసు క్రొత్తమార్గానికి త్రిప్పివేశాడు, రాముని ఆరాధ్యదైవంగా భావించి తనపేరు "రామదాసు" రాముని దాసు అని పెట్టుకొన్నాడు. భగవద్భక్తి ప్రచారం చేస్తూనే "సంఘటన"లో గల గొప్పతనాన్ని ప్రజలకు వివరించాడు. తాను తీర్థయాత్రలుచేసి దేశపరిస్థితిని బాగా తెలుసుకొన్నాడు రాజకీయదృష్టితో శివాజీ ప్రారంభించిన స్వరాజ్యోద్యమాన్ని రామదాసు బాగా సమర్థించాడు. అందువల్లనే శివాజీకిగూడా గురువైనాడు.

దాసబోధలగు రామాయణము, కరుణాష్టకము ఆయన ఉత్తమ గ్రంథాలు. ఆనాటి మహారాష్ట్రానికి కావలసిన ఉత్తమబోధ దాసబోధలో లభ్యమవుతున్నది. దాసబోధలో మహంతు దగ్గరనుండి మహామూర్ఖునివరకు ప్రతివాని స్వభావమూ వర్ణించబడింది. రామదాసు కేవలం సన్యాసికాదు. వాస్తవవాది. ఈయన కవిత్వంలో కావ్యరసికతకంటే ఎక్కువగా భావాలకు ప్రాముఖ్యత ఉన్నది. రామదాసు కవికంటే సంఘసంస్కర్త అనడం ఎక్కువ ఉచితంగా కనబడుతుంది.

ఆయన పరంపరలోని వారే జయరామ్, వడగాంవ్‌కర్, రంగనాథస్వామి నిగడీకర్, కేశవస్వామి, ఆనందమూర్తి మొదలైనవారు. రామదాసు ఈ కవులకు రామదాస పంచాయతన మని నామకరణం చేశాడు. ఈ పరంపరలో వీరేగాక ఇంకా అనేకమంది కవులు ఉద్భవించారు. వీరిలో వేణాబాయి, గిరిధర్ మొదలైనవారు చేరి ఉన్నారు.

ముకుందరాజుల కాలంనాటికంటే రామదాసు కాలంనాటికి కావ్యవస్తువు చాలా మారిపోయింది. రామదాసు సమకాలికుడైన వామన పండితుని కృషివలన మహారాష్ట్ర సాహిత్యంలో పాండిత్యమూ, కళాప్రియత్వం బాగా వ్యాప్తిపొంద నారంభించినవి.

వామనపండితుని కావ్యాలను రెండు విభాగాలుగా విభజించవచ్చును. ఆధ్యాత్మిక గ్రంథాలలో "యథార్థదీపిక" భగవద్గీతను స్పష్టీకరించడానికి వ్రాయబడిన గ్రంథం. జ్ఞానేశ్వరుడు ఇదే విషయంపై తాను వ్రాసిన గ్రంథానికి భావార్థదీపిక అని నామకరణం చేశాడు. యథార్థదీపిక, నిగమసారము, అపరోక్షానుభూతి, కర్మతత్త్వము మొదలగు గ్రంథాలు ఆధ్యాత్మికమైనవి.

లౌకిక గ్రంథాలలో భామావిలాసము, రాధావిలాసము, హరివిలాసము, సీతా స్వయంవరము, శుకరంభా సంవాదము, బాలక్రీడ మొదలగు గ్రంథాలు రసవంతమైనవి. పౌరాణిక కథలలో అన్ని రసాలూ ఉంటుంటవి.

వామనపండితుని రచనలలో యమకం ఎక్కువగా ఉంటుంది. అందుకుగాను కొంతమంది ఆయనను గురించి యమక్యా అని ఎగతాళిగా అంటుంటారు. ఏమైనా వామనపండితుడు కేవలం అనురసిష్ఠుడైన కవిమాత్రమే కాదు. అతడు మరాఠీ సాహిత్యానికి కొత్తకొత్త వృత్తాలనూ, అలంకారాలనూ, ప్రసాదించాడు. ఒక కొత్త సంప్రదాయాన్ని వామనుడు ప్రవేశపెట్టాడు. 1608 నుండి 1695 వరకు వామనుడు జీవించి ఉన్నాడు. ఆ కాలాన్ని శివయుగం, లేక స్వాతంత్ర్యయుగం అని అంటుంటారు. ఉపదేశాత్మకమైన కవితామార్గం వదలివేయబడి భావుకత్వ ప్రధానమైన కవితాయుగం ఆనాటినుండి మరాఠీ సాహిత్యంలో ప్రారంభమయింది.

వామనపండితుని కోవకు చెందినవాడే రఘునాథ పండితుడు. నియమానుసారంగా పంచకావ్యాలను రచించిన మొదటికవి ఇతడు. నలదమయంతీ స్వయంవరాఖ్యానం ఈయన రచించిన ప్రసిద్ధగ్రంథము. ఈ గ్రంథంలో హంస, నలుడు వీరిమధ్య జరిగిన సంభాషణ ఎంతో మనోహరంగా వర్ణించబడ్డది. మానవ స్వభావంతోబాటు పక్షిస్వభావం గూడా మనోహరంగా ఆ గ్రంథంలో చిత్రించబడింది. స్వభావచిత్రణంలో ఈ కావ్యం విశేష ప్రఖ్యాతిని పొందింది.

ఆఖ్యానాలమీద కవిత్వం వ్రాయడం గూడా ఈ కాలంనాటి విశేషమే. ఇదే దృష్టితో రఘునాథుడు ఆనంద తనయ అనే కావ్యాన్ని పౌరాణిక గాథను ఆధారంగా తీసుకొని వెయ్యి పదాలలో వ్రాశాడు.

ఇదేకాలంలో తంజావూరు ప్రాంతంలో గూడా కొంతమంది రచనలు సాగించారు. వారిలో మాధవకవి చాలా ప్రసిద్ధుడు. మాధవకవి రామాయణము, మహాభారతము మొదలగు గ్రంథాలను రచించాడు. తంజావూరు రచయితలు నాట్యసాహిత్యం మీదగూడా గ్రంథరచన సాగించారు.

శివాజీ దర్బారులో ప్రసిద్ధిపొందినకవి సామరాజు భోంసలాల కులగురువుల కుటుంబంలో అతని జననం జరిగింది. తన కుల గౌరవాన్ని పురస్కరించుకొని అతనికి రాజాశ్రయం లభించింది. రుక్మిణీహరణము, ముద్గలాఖ్యానము, మొదలగు వీరి రచనలు చాలా ప్రఖ్యాతిని సంపాదించినవి. సామరాజు సమకాలికులు నాగేశకవి, విఠల్ బీడకర్‌లు. నాగేశకవి సీతా స్వయంవరము, విఠలుని రుక్మిణీ స్వయంవరము, ద్రౌపదీ వస్త్రాపహరణము, పాంచాల శ్రవణము, ప్రసిద్ధమైన కృతులు. విఠలుని ఛందశ్శాస్త్రము, చిత్రకావ్యము, రచనాకౌశల్యము అనే గ్రంథాలు గూడా ఉత్తమమైనవి.

## పేష్వాలకాలము

ఈ కాలంనుండి పేష్వాలకాలం వరకు వివిధరచనలు మరాఠీలో జరిగినవి. పేష్వాల కాలంలో వేదాంత పరిపక్వమైన కవిత్వమూ, ఆఖ్యానాత్మకమైన రచనలూ వ్యాప్తినొందినవి. ఆభ్యంతరిక రంగంతోపాటు బాహ్యరంగంలో గూడా కవిత్వంలో చాలా మార్పువచ్చింది. ఈ కాలంలో వృత్తాత్మకమైన కవిత ఎక్కువగా ప్రచారంలోకి వచ్చింది.

ఇదేయుగంలో నిరంజన మాధవుడుగూడా కొన్ని రచనలు సాగించాడు. తరువాత పౌరాణిక కథావస్తువులను ఆధారంగా చేసుకొని శ్రీధరుడు రచించిన పదాలు ఈనాటికీ గూడా బహుజన సమాజంలో ఎక్కువ వ్యాప్తిలో ఉన్నవి. మనోరంజనాన్ని సమకూరుస్తూ సాంసారిక బాధలతో పరితప్తమైన మానవసమాజాన్ని భక్తిమార్గంవైపుకు ప్రవృత్తులను చేయడంలో కృతకృత్యుడైన మహాకవి ఇతడు తప్ప ఇంకొకరు లేరని చెప్పడంలో అతిశయోక్తిలేదు. ఈయన ఇతర రచనలు హరివిజయము, రామవిజయము, పాండవ ప్రతాపము శివలీలామృతము మొదలైనవి.

ఇదేకాలంలో మధ్వముని, అమృతరాయ, మహీపతిబువా మొదలైన వారు గూడా రచనలు సాగించారు. మహీపతి రచితాలైన భక్తవిజయము, సంతలీలామృతము, భక్తలీలామృతము, సంతవిజయము, గణేశ పురాణము, దత్తాత్రేయ చరిత్ర గ్రంథాలు మరాఠీ సాహిత్యంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొన్నవి.

## మోరోపంత్

మోరోపంత్ మహారాష్ట్ర భాషలో విశేషంగా రచనలు చేశాడు. 18 వ శతాబ్దంనాటి ఈ కవిలో వామన పండితుని పాండిత్య ప్రకర్షా, నిరంజన మాధవుని రచనాచాతుర్యమూ,

మొదలగునవి మూర్తీభవించినవి. 1729 నుండి 1794 వరకు ఆయన జీవించి ఉన్నాడు. ఈమధ్య కాలంలో మహారాష్ట్ర దేశంలో అనేకమైన రాజకీయపు మార్పులు జరిగినవి. కాని ఆమార్పుల ప్రభావం మోరోపంత్ మీద పడినట్లు కనపడదు. ఆయన సామాన్యజనం కొరకు రచనలు సాగించి స్వయంగాపాడి వినిపిస్తూ ఉండేవాడు. మోరోపంత్ మరాఠీలోనే గాక సంస్కృతంలో గూడా విద్వాంసుడు. ఆయన మహాభారతము, రామాయణము, శ్రీకృష్ణ విజయము, మంత్రి భాగవతము రచించాడు. రామాయణం ఒక్కసారి వ్రాస్తే ఆయనకు సంతోషం కలుగలేదు. 108 రకాలైన రామాయణాలను వేరువేరు ఛందస్సులలో ఆయన రచించాడు.

## షాహిరీ వాఙ్మయ

మోరోపంత్ కాలంలోనే మహారాష్ట్ర భాషలో ఒక కొత్త సంప్రదాయం బయలు దేరింది. దానినే షాహిరీ కావ్య సంప్రదాయమని అంటారు. ఈ సంప్రదాయంలో పోవాడా లావణీలు ప్రముఖమైనవి.

మరాఠీలో మొదటి పోవాడా 1659 లో అఫ్జల్‌ఖాన్ వధ సందర్భంలో వ్రాయబడింది. శుభసమయాలలో కులదేవతలను ఆరాధించే "గోంధళ్" అనే ఒక పద్ధతి మహారాష్ట్ర దేశంలో అమలులో ఉన్నది. ఈ గోంధళ్ లోనుండియే పోవాడా ఉత్పన్నమైనది. గోంధళ్‌లో మొదట దేవతాస్తవము తరువాత కొంత కథాభాగము ఉంటుంది ఈ కథాభాగంలో మహారాష్ట్ర వీరులగాథలు వర్ణింపబడుచుండేవి. అనాటి దేశపరిస్థితి గూడా ఇటువంటి సాహిత్య సర్జనానికి బాగా తోడ్పడ్డది. షాహిర్‌లకు రాజాశ్రయము లభించినందువల్ల రాజులను సంతోష పెట్టడానికి గూడా కొన్ని పోవాడాలు రచింపబడ్డవి. నానాసాహెబ్ పేష్వే హాలకిదే, భవ్రాపీ లఢాయీ, బాజీరావ్ లాంటి రచనలన్నీ ఇదేపద్ధతిలో వేయబడినవి.

పోవాడాలతో పాటు లావణీలు గూడా ప్రచారంలోనికి వచ్చినవి. పీష్వాల చివరి రోజులలో లావణీలు బాగా వ్యాప్తమైనవి. దేవతాస్తవం కొరకు పోవాడాలు పుట్టినట్లే జనసామాన్యాన్ని ఆనందింపచేసి వారి దగ్గర బహుమానాలను సంపాదించడానికి లావణీలు పుట్టినవి.

"లావణీ" మహారాష్ట్ర దేశంలోని జీవిత కావ్యం. పోనుపోను లావణీలో సంగీతం గూడా చేరింది. శృంగార రసానికి లావణీలు ప్రాముఖ్యత ఎక్కువ ఇచ్చినా అన్నిరకాల పాటలూ అందులో చేరినవి. కల్పనా విన్యాసము, నాదయుక్త సంగీతము, మొదలగు వాటి వల్ల లావణీకి మహారాష్ట్ర దేశంలో ఎక్కువ వ్యాప్తి కలిగింది. అనంతఫందీ, రామజోషి పరశురామ్, ప్రభాకర్ హోనాజీ మొదలగు లావణీకారులు మహారాష్ట్ర సాహిత్యంలో ప్రధాన స్థానాన్ని సంపాదించుకొన్నారు.



**పుస్తక సమీక్ష :**

# జ్యోతి

## (సచిత్ర మాస పత్రిక)

సంపాదకులు : **ధనికొండ హనుమంతరావు.**

కార్యాలయము : **4 వాలుమొదలి వీధి, మద్రాసు-17.**

*సంవత్సర చందా రు. 6-0-0 — విడిప్రతి 6 అణాలు.*

[illegible] 1955 [illegible]

— "సాహితి"

# అభ్యుదయ

## (అభ్యుదయ రచయితల ఐదవ మహాసభ సంచిక)

*ప్రచురణ : అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ.*

వెల : *1—8—0*

చాలాకాలం తరువాత అభ్యుదయ రచయితల సంఘం పునరుద్ధరింపబడి, విజయవాడలో ౧౯౫౫ జులై ౩౦, ౩౧ తేదీలలో ఐదవ మహాసభ జరిగింది. ఆ మహాసభ సందర్భంలో ఈ సంచిక తీయబడింది. అభ్యుదయ పత్రిక తిరిగి ప్రచురింపబడుతుందని తెలుస్తున్నది. ఇది హర్షించదగిన విషయం.

ఈ ప్రత్యేక సంచికలో శ్రీ శ్రీ అధ్యక్షోపన్యాసం, ఉప్పల లక్ష్మణరావు గారి ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం, ప్రముఖ సాహితీవేత్తల సందేశాలు,

వివిధదేశాల రచయితల సంఘాల శుభాకాంక్షలు మొదలగువాటితోపాటు ప్రామాణికమైన వ్యాసాలు, కొన్ని గేయాలు వున్నవి.

పి. వి. రాజమన్నారుగారి 'కఠినమార్గం' ప్రత్యేకంగా చెప్పుకోదగిన నాటిక. బైబిలు ఆధారంగా ఈ నాటిక వ్రాయబడింది. నాటిక కాలం కూడా ఏసుక్రీస్తు జీవించివున్న రోజులు. ఒక పాశ్చాత్యకథనాన్ని ఆధారంగా పెట్టుకొని వ్రాయబడినా, ఈ నాటికలో భారతీయత ఎంతో ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది.

అనిసెట్టి సుబ్బారావుగారి 'చెప్పులింక సగాలు' అనే మరోనాటిక అభ్యుదయ దృక్పథంతో వ్రాయబడిన రచన.

సోమసుందర్ గేయం "ప్రాంగణ సంక్రాంతి" లయబద్ధమైన రమణీయ రచన.

కుందుర్తి, రెంటాల, నాగసూరి, గోస్వామి గారావు, గంగినేని మొదలగు వారి గేయాలు ఈ సంచికలో వున్నవి. అయితే 'తెలంగాణా' అనే కావ్యంలోంచి ఒక ఖండను ఇప్పుడు అచ్చువేసి ఆదుర్దినాలను జ్ఞప్తికితేవడం బాగా లేదు.

కొడవటిగంటి కుటుంబరావుగారు వ్రాసిన 'కథా-నవలా' అను వ్యాసం, ఆంధ్రనాటక సాహిత్యమును గూర్చి శ్రీనివాస చక్రవర్తిగారు వ్రాసిన వ్యాసం, నేటి వాడుక భాషే నేటి గ్రాంథిక భాష అనిచెప్పే గిడుగు సీతాపతిగారు వ్రాసిన వ్యాసం, మన బాలసాహిత్యాన్ని గూర్చి నార్ల చిరంజీవిగారు చేసిన సమీక్ష చదవదగిన రచనలు.

"అభ్యుదయ కవిత్వము, సవిమర్శ సమీక్ష" అను శీర్షికతో రమణారెడ్డిగారు వ్రాసినవ్యాసం ఈ సంచికకు ఎంతోమూల్యాన్ని చేకూర్చింది. ఈ వ్యాసం లోకొంత ఆత్మ విమర్శచేసుకోబడింది. అభ్యుదయ రచయితల సంఘ సభ్యులచే సృష్టింపబడిన దొక్కటే అభ్యుదయ సాహిత్యమనీ, తత్పూర్వులూ తద్భిన్నులూ సృష్టించినది అభ్యుదయసాహిత్యము కాదని అనుకోరాదనీ వ్యాసకర్త హితవు చెప్పారు. అంతేగాక శ్రీ శ్రీ వ్యక్తిగతంగా త్రొక్కిన సర్రియలిజంవంటి ప్రయోగాలు దేశంలో ఎవ్వరి ఆమోదాన్ని పొందలేదనీ, ఆ వింత త్రోవలను అభ్యుదయ సాహిత్యానికి అంటగట్టకూడదనీ అన్నారు.

అభ్యుదయ రచయితల సంఘం పునరుద్ధరింపబడుతూవున్న ఈ సమయంలో రమణారెడ్డిగారు వ్రాసిన మరికొన్ని విషయాలు కూడా రచయితలు బాగా ఆలోచింపదగి వున్నవి. "వ్యక్తి సంఘమూ పరస్పరాశ్రితాలు. వ్యష్టి

సమష్టిని గౌరవించక తప్పదు. లేకుంటే సమష్టి కోల్పోతుంది... బహుముఖమైన మానవజీవిత సమస్తాన్ని సమగ్రంగా విమర్శించి విస్పష్టత, సారళ్యమూ, సౌందర్యము అనే లక్ష్యత్రయానికి కట్టుబడిన సాహిత్యాన్నే వాస్తవ వాద సాహిత్యమంటాము." అని రమణారెడ్డిగారన్నారు. తెలంగాణాలో వెల్లివిరిసిన అభ్యుదయ కవిత్వాన్ని ఈ వ్యాసకర్త సమీక్ష చేయలేదు. అందుకు కారణం వారికి ఇక్కడ గ్రంథాలు లభించకపోవడమేనట!

అభ్యుదయ సాహిత్యోద్యమం చరిత్రనూ అట్టి ఉద్యమ ఆవశ్యకతనూ ఎవరూ కాదనలేరు. అయితే కేవలం ఒకానొక రాజకీయ పార్టీకి పక్కతాళంగా వుండక, వర్గ సంఘర్షణలను మాత్రమే చిత్రిస్తూ కార్బన్ కాపీలవంటి రచనలను ఉత్పత్తిచేయడంలో నిమగ్నులుకాక కాని, సంఘ కార్యదర్శిగా ఎన్నికైన తుమ్మల వెంకటరామయ్యగారన్నట్లు జీవిత సత్యాల్ని అవగాహన చేసుకుంటూ, అభ్యుదయ దృక్పథమలవరచుకుంటూ, ఉత్తమ శిల్పమూ ఉదాత్తభావసంపన్నతనూ కృషీ సాధనా తపస్సూ చేసిన నాడు ఉత్తమ సాహితీ సృష్టి జరుగుతుందనడంలో ఎవరికీ అభిప్రాయ భేదం వుండనక్కరలేదు.

—"సౌమిత్రి"

## కథలు రాయడమెలా?

రచయిత :
శ్రీ శాంతి కృష్ణమూర్తి

ప్రచురణకర్తలు :
యశోధర ప్రచురణలు,
హనుమకొండ, వరంగల్.
వెల : 1—8—0

కథా రచయితగా శ్రీ కృష్ణమూర్తిగారు పాఠకులకు సుపరిచితులు. కథా సాహిత్య ప్రక్రియల్లో కొన్ని అనుభవ విజ్ఞానాలను గడించుకొని "కథలు రాయడమెలా?" ప్రచురించారు. విషయసేకరణకు, ప్రతి చిన్న విషయాన్నీ విపులంగా చర్చించడానికి కృషి చేశారు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారన్నట్టు, 'కథకులు కాబోయేవారు తమ బాధ్యతలను తెలుసుకోవడానికీ, అయోమయస్థితిలో కథారచన సాగించుతున్నవారు ఒక దారికి రావడానికీ' ఈ పుస్తకం కొంతమటుకు ఉపయోగపడుతుంది.

కథా సాహిత్యాన్నిగూర్చి లోగడ శ్రీ మహమ్మద్ - కాశింఖాన్‌గారు "కథానిక" అన్న పుస్తకంలో చర్చించారు. 'కథానిక' లో కంటే ఈ పుస్తకంలో కొంత విషయ వివరణ ఉందనక తప్పదు. కథకులు కాగోరువారు, కథా ప్రక్రియలను తెలుసుకోగోరువారు ఈ పుస్తకం తప్పక చదవాలి.

— *సింగరాజు*

# ఆనందమఠం

**బంకించంద్ర చటర్జీ వంగభాషలో రచించిన ప్రసిద్ధనవలకు అనువాదం;**

**రచన : 'స్ఫూర్తిశ్రీ'**

**'*విపంచికా ప్రచురణలు*' కాకినాడవారి ప్రచురణ**

***1/8* *క్రౌనుసైజున 210 పుటలు*** ***వెల : రూపాయిన్నర***

18 వ శతాబ్ది చివరిభాగంలోని వంగదేశ పరిస్థితులు భూమికగా తీసుకొని అప్పటి సంఘంలోని మతభేదాలూ, వాటిని వినియోగించుకొని ఆంగ్లేయులు నడిపిన భేదనీతి యీనవలలో కథావస్తువులు. 1774-77 వరకు కరువు కాటకాలు వంగదేశాన్ని పీల్చిపిప్పిచేశాయి. అప్పటికి నవాబులే పరిపాలనలో ఉన్నప్పటికీ ఆంగ్లేయులను వారి పక్షాన ప్రజలవద్దనుండి పన్నులు వసూలు చేయడానికి నియమించారు. అలాగ పన్నులు వసూలుచేసి రస్తుతీసుకొని పోయేటప్పుడు దారిలో దొంగల ముఠాలు వారిని దోచుకొనేవారు. ఈ దొంగల ముఠాల నుండి తప్పించుకొనడానికి వారికి రక్షణగా సైన్యాలనుకూడా తీసుకొని పోయే వారు. ఈ సైన్యంలో తురకలు ఎక్కువమంది ఉండేవారు. వీరు హిందువుల్ని నానాహింసలు పెట్టేవారు. మగవారిని బంధించడం, ఆడవారిని చెఱపట్టడం, నగలూ, ఆభరణాలూ దోచుకోవడం ఇటువంటి అమానుష చర్యలు చేసే వారు. వీరిని ఎదుర్కోవడానికి త్యాగబుద్ధిగల కొందరు యువకుల్ని చేరదీసి ఒక మహాత్ముడు ఒక ప్రతిఘటనోద్యమాన్ని నడిపిస్తాడు. వారికి ప్రధాన కార్య స్థానం అడవిమధ్యంలోని 'ఆనందమఠం' అనే ఆశ్రమం. ఈ యాశ్రమంలో చేరిన వారందరూ సంసారులయినా సరే కాషాయ వస్త్రాలు ధరించి గోసా యీలలాగు జీవిస్తారు. ప్రాణాలు అర్పించి అయినా జాతిశ్రేయస్సునీ దేశ గౌరవాన్ని కాపాడాలనీ ప్రతిజ్ఞతీసుకొంటారు. ఈ సైన్యంపేరు 'సంతానములు'.

వీరు ఆంగ్లేయుల సేనలమీదా, వారికి అండగా ఉన్న తురకల మూకలమీదా తిరుగబడి యుద్ధంచేసి ఆత్మరక్షణ చేసుకొంటారు. ఈ సంఘర్షణలో ఈ సన్యాసులకు కలిగిన అనుభవాలు, వారు ప్రేమించిన ధర్మపత్నులకు సంతానానికి కలిగిన కష్టదుఃఖాలు చక్కగా వర్ణించారు. ఈ పుస్తకంలోనే నేడు మన జాతీయగీతంగా స్వీకరించిన 'వందేమాతరం' అనే పాట తొలిసారి ఉల్లేఖ్యమయింది. ఇందులో ఇతివృత్తానికి చారిత్రిక ఆధారాలు లేకపోయినా అప్పటి వాతావరణం మాత్రం చరిత్రానుసారంగా సరియైనదే. బంకిం చంద్రుడు తన సహజధోరణిలో ఆ చరిత్ర తీసుకొని తన కల్పనా శక్తితో చక్కని కథ సృష్టిచేశాడు. ఆంగ్లేయుల పెత్తనపు వ్యవస్థ మాత్రం ప్రతిఘటించి వారి పరిపాలన స్థాపించిన హిందూదేశ యథార్థంలో నిరూపితమయింది. అందుకే కథ చివర మహాత్ముడన్నట్లు "స్వాతంత్ర్యమెప్పుడు? ఇంగ్లీషువారు రానారు మనకు మిత్రులు." అన్న వాక్యాలు నేటి స్వతంత్ర భారతంలో కూడా అన్వయిస్తాయి.

ఈ నవల అనువాదాలు ఇదివరలో వాసికెక్కినవైనా, ఆంధ్ర ప్రచారిణీ వారు ప్రకటించారు. కాని ప్రస్తుత అనువాదంలో గ్రాంథిక భాష ఉపయోగించకుండా చిన్నచిన్న వాక్యాలలో సులువైన సరళమైన వ్యావహారిక భాష ఉపయోగించారు. ఇదిసులభంగా చదవగలిగిన వారికి ఈ పుస్తకం చదువుకోవడానికి మంచి ఆకర్షణ కలిగిస్తుంది.

—'శ్రీవాత్సవ'

# హృద్గీత

**రాయలు ⅛ సైజున 18 పేజీలుగల ఈ పద్యకావ్యం ఒక ఆధునిక శతకం.**

**వెల : అమూల్యం**

**రచన : సంపత్కుమార, సుప్రసన్న అనే జంటకవులు**

**ముద్రణ : రామలింగేశ్వర ప్రెస్, వరంగల్, నైజాము స్టేట్**

ఇది ప్రథమంగా వివేకానంద పత్రికలో వెలువడిందట! వృత్తరచనలో అభ్యాసం చేయడానికి తెలుగు పద్యరచనలో చేతులు తిరగడానికి శతకం మంచి వ్యాయామ సాధన. ఈ శతకానికి స్వరకల్పన చేసిన కవి సమ్రాట్ విశ్వ

శాస్త్రి సత్యనారాయణగారన్నట్లు 'ఈ చిన్ని కావ్యమునందు పద్యరచనా గత బహులవిచ్ఛిత్తి విశేషములు గలవు.' 'సర్వేశ్వర' మకుటముగల ఈ పద్య శతకములోని వృత్తములన్నీ శార్దూలాలూ మత్తేభాలున్నూ! ఈ జంటకవులు శార్దూలాలచేత, మత్తేభాలచేతా సర్కసు చేయించారు. అయితే ఆ సర్కసులో ఒక్కొక్కసారి అవి వీరు చెప్పినమాట విన్నవి; మరొకసారి వీరి చేజారిపోయినవి. యతిస్థానము విచ్ఛిత్తి చేయుటలో 'హ్వే' 'గ్రా' 'స్మా' 'ద్వై' 'ద్వే' వంటి విషమప్రాసలను అవలీలగా ప్రయోగించుటలో ద్విపాద త్రిపాద దీర్ఘములయిన సమాసములను పొడిగించుటలో వీరు శార్దూలాలచేత నిజంగా సర్కసు చేయించారు. అయితే యీ సర్కసు లేకుండా సామాన్యముగా నిరాడంబరముగా పద్యము కమ్మెచ్చున తీసినట్లు లాగినప్పుడే వీరి ప్రతిభ ద్యోతకమగుచున్నది. చూడండి ఈ పద్యం :

**తెలివాబిల్లి వెలుంగు వెల్లికల ప్రోదింజేసినట్లయ్యె నీ**
**కలిమింగల్గుట యొప్ప నేయుటకు నీ కాలమ్ము చాలింతె నా**
**కలలో నైనను విమ్ము నమ్మెదు నటుల్ గావింపుమీ యెల్ల వే**
**ళల నీవై కడతేర్పగావలయు - నాలక్ష్మమ్మ! సర్వేశ్వరా!**

పాండిత్య స్ఫోరకాలయిన ప్రౌఢ ప్రయోగాలు వీరి పద్యశతంలో అందందు ప్రకాశిస్తున్నప్పటికీ, తెలుగు వ్యాకరణ దీపాన్ని పెద్దదిచేసి వీరు తీసుకొన్న స్వేచ్ఛలు శతకప్రయుక్తములగుటచేత క్షంతవ్యములనవచ్చును. 'అంతా' 'కూడా' వంటి అనవసరదీర్ఘాలూ 'భ్రాంతే చిత్రము' 'బ్రతికుండుదాక' 'వేరొకటుండగావలయు' 'ఇంతేకాదు' వంటి వ్యావహారిక సంధులు వీరు యథేచ్ఛగా వాడుకొన్నారు. 'ప్రౌఢ కవిత్వములోని గ్రాంథిక్యము అలవరచుకొన్న వీరి కవితాపాకము మిక్కిలి ప్రశస్త పథమున నున్న' దని 'విశ్వనాథ' వారు మెచ్చుకొన్నారు. వయస్సున చిన్నవారయిన ఈ కవులు ఈ శతకరచనలో కనబరచిన పాండిత్య స్ఫూర్తి సహృదయరంజకంగా ఉన్నది.

**ఆరేటీవమునుండి వెల్గునటు లయ్యా! దృక్ శ్రవంబుల్ వశం**
**బౌరా! మానవు దందినాతుగద! ఇంకా కామ అజ్ఞానయుధ**
**శ్రీరామాజుతి భర్తయై ప్రళయపీడోలికామధ్య కే**
**క్కారాదుక్కందగుటల్ వినాశనమునంటా కాంత! సర్వేశ్వరా!**

'శ్రీవాత్సవ'





సికింద్రాబాదు మేయరు శ్రీ రంగపాండుగారు అధ్యక్షులు.
గౌ. రెవిన్యూశాఖామాత్యులు శ్రీ కె. వి. రంగారెడ్డిగారు పట్ట ప్రదానోత్సవమును గావించిరి.



హిందీ ప్రచారసంఘ కార్యాలయంలో జరిగిన మహేంద్రోదయ కావ్యం ఆవిష్కరణోత్సవ సందర్భంలో శ్రీ సి. నారాయణరెడ్డి, రామలింగం, అంకేయమ్మ గార్లు గో. గోపాలరెడ్డిగారికి స్వాగతాన్ని తెలియజేస్తున్నారు.

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 327 Residency Road, Hyderabad-Dn. & Printed at Ajanta Printers, Mahakali St., Secunderabad.